ఘోషౌజ్జ్వలం శతక్రతుపరాక్రమౌ పృథురణక్రతుం చక్రతుః ॥౧౪.౨॥
॥ గ ॥ తతస్సుమిత్రానన్దనస్పర్శనలాలితేషు మార్గణేషు లుబ్ధమివా
ధిగమ్య యాతుధానమేనం లబ్ధముఖభఙ్గేషు హిరణ్యగర్భవరసమూ

---

మహాన్, రణః - యుద్ధమేవ, క్రతుః - యజ్ఞః, తం చక్రతుః - వితేనతుః. అత్ర రణే క్రతుత్వారోపం ప్రతి నారదే బ్రహ్మత్వారోపస్య రామచన్ద్రే ఉపద్రష్టృత్వారోపస్య చ బ్రహ్మోపద్రష్ట్రోః యజ్ఞాఙ్గత్వేన అఙ్గత్వాత్ సావయవో రూపకాలఙ్కారః ॥ ౧౪.౨ ॥

తత ఇతి ॥ తతః - అనన్తరమ్, సుమిత్రాయాః - దశరథపత్న్యాః, నన్దనస్య - సుతస్య లక్ష్మణస్య, స్పర్శనేన - కరస్పర్శేన, మోచనేనేత్యర్థః. లాలితేషు - ఉపలాలితేషు, అన్యత్ర సుష్ఠు, మిత్రస్య - సూర్యస్య, ఆనన్దయతీత్యానన్దనః ॥ సూ ॥ నన్ద్యాదిత్వాల్ల్యుః. ప్రీతిజనకః, సుతః - కర్ణ ఇత్యర్థః. తస్య యత్ స్పర్శనమ్, దానమ్, తేన లాలితేషు - కర్ణవితరణతృప్తమానసేష్విత్యర్థః. ॥ ని ॥ మిత్రం సుహృది వా రవౌ । స్పర్శే త్వగిన్ద్రియే దానే స్పర్శనం మారుతే పుమాన్ । నన్దనం వాసవోద్యానేసు తేనా హర్షకే త్రిషు ఇతి చ నానా. మార్గణేషు - బాణేషు యాచకేషు చ, ॥ ని ॥ అథ మార్గణమ్ । యాచ్ఞాన్వేషణయోః క్లీబే పుమాన్ యాచకబాణయోరితి నానా. ఏనం యాతుధానమ్ - అతికాయనామానమ్, లుబ్ధమివ - కృపణమివేత్యుపమా. ॥ ని ॥ లుబ్ధోఽభిలాషుకస్తృష్ణగిత్యమరః. అధిగమ్య - ప్రాప్య, ఏకత్ర శరవ్యత్వేన అన్యత్ర దాతృత్వసమ్భావనయేతి భావః. లబ్ధః - ప్రాప్తః, ముఖస్య - ధారాయాః, భఙ్గః - మోటనమ్, అన్యత్ర ముఖభఙ్గః - ముఖపరాజయః, తిరస్కార ఇతి యావత్. తై స్తథోక్తేషు సత్సు. ఏకత్ర త్రుటితముఖేషు, అన్యత్ర తిప్పితమహాప్రివ్య ప్రతినివృత్తేష్వితి భావః. మరుత్ - వాయుః, అస్య - అతికాయస్య, హిరణ్యగర్భః - బ్రహ్మా, తస్య వరేణ - ప్రసాదేన, ॥ ని

పాదితదుర్భేదకవచసన్దర్భితగాత్రతయా పితామహాస్త్రమన్తరేణ దుర్జయతామస్య లక్ష్మణశ్రవసి మరుదనురహసముపదిదేశ ॥ ౧౮౩ ॥

॥ ప ॥ నిశమయ్య సమీరవచస్స జవాదఖిలాస్త్రవిదస్త్రమధత్త విధేః । బహునా కిమనేన ధుతం నిమిషాదతికాయశిరోఽప్యతికాయమభూత్ ॥

---

దేవప్రసాదే వరణే జామాతరి వరఃపుమానితి నానా. సమాపాదితేన - ప్రాప్తేన, దుర్భేదేన - భేత్తుమశక్యేన, కవచేన - కఞ్చుకేన, సన్దర్భితమ్ - సఙ్ఘటితమ్, గాత్రం యస్య తస్యభావస్తత్తా తయా హేతునా, అభేద్యకవచతయేత్యర్థః. పితామహస్య - బ్రహ్మణః, అస్త్రమ్, అన్తరేణ - వినా ॥ సూ ॥ అన్తరాన్తరేణయుక్తే ఇతి ద్వితీయా. దుర్జయతామ్ - జేతుమశక్యత్వమ్, అనురహసమ్ - రహసి, ॥ సూ ॥ అన్వవతప్తాద్రహస ఇతి సమాసాన్తష్టచ్. లక్ష్మణస్య శ్రవసి - శ్రోత్రే, ఉపదిదేశ - ఉపదిష్టవాన్ ॥ ౧౮౩ ॥

అథ లక్ష్మణేన తస్య సంహారమాహ — నిశమయ్యేతి ॥ అఖిలాస్త్రవిత్ - సర్వాస్త్రకుశలః, సలక్ష్మణః, సమీరవచః - మారుతవచనమ్, నిశమయ్య - శ్రుత్వా, ॥ వ్యా ॥ శమేర్ణిచి శమోదర్శనే ఇతి మిత్వాద్ధ్రస్వః తతఃక్త్వో ల్యప్ లఘుపూర్వాదితి ణేరయాదేశః. జవాత్ - వేగాత్, వాయువచనశ్రవణానుపదమేవేత్యర్థః. విధేః అస్త్రమ్ - బ్రహ్మాస్త్రమ్, అధత్త - ధృతవాన్, ధాఞో లఙ్. బహునా కిమ్ - బహునా ఉక్తేన కింప్రయోజనమిత్యర్థః, అనేన - బ్రహ్మాస్త్రేణ, నిమిషాత్ - నిమిషమాత్రేణ, ధుతమ్ - స్థానాచ్చాలితమ్, అతికాయశిరోఽపి, అతికాయమ్ - అతిక్రాన్తకాయంసత్, అభూత్. బ్రహ్మాస్త్రేణ ఛిన్నమతికాయశిరోఽతిక్రమ్య శరీరమూర్ధ్వముత్పపాతేత్యర్థః. అత్ర అతికాయశిరసోఽప్యతికాయత్వమితి చిత్రమ్, తోటకవృత్తమ్. తదుక్తమ్ " ఇహ తోటకమమ్బుధిసైః కథితమ్ " ఇతి. ॥ ౧౮౪ ॥

॥ ప ॥ తనుజానుజశోకవిక్లబం పితరం రావణిరాహవోద్భటః । నిజయా విజయప్రతిజ్ఞయా చిరమాశ్వాస్య రణాయ నిర్యయౌ ॥ ౧౮౫ ॥

॥ గ ॥ గత్వా రణాజిరమన్యోన్యసైన్యయోస్సన్నహ్యతో రథమభితో రక్షిణస్సమాదిశ్య ప్రవిశ్య లఙ్కాం విచిత్రాభిరాహుతిభిర్విధివదర్చ్యతేన సప్తార్చిషా సమర్పితశస్త్రాస్త్రసమ్భారః, పున

---

తదను ఇన్ద్రజితో రణప్రయాణమాహ — తదను జేత ॥ తనుజానుజయోః - అతికాయకుమ్భకర్ణయోః, శోకేన - దుఃఖేన, విక్లబమ్ - దీనమ్, పితరమ్ - రావణమ్, ఆహవోద్భటః - సమరోద్ధతః, రావణస్యాపత్యం రావణిః - ఇన్ద్రజిత్, నిజయా - స్వకీయయా, విజయప్రతిజ్ఞయా - అహమిదానీం రామలక్ష్మణౌ జిత్వైవాగమిష్యామీతి నిశ్చయేన, చిరమ్, ఆశ్వాస్య - సమాధాయ, రణాయ నిర్యయౌ - నిర్గతః. వియోగినీవృత్తమ్, తదుక్తమ్ " విషమే ససజా గురుస్సమే సభరా లోఽథ గురుర్వియోగినీ " ఇతి ॥ ౧౮౫ ॥

గత్వేతి ॥ రణాజిరమ్ - సమరభూమిమ్, గత్వా, అన్యోన్యసైన్యయోః - కపిరాక్షససేనయోః, సన్నహ్యతోః - యుద్ధాయ కృతసన్నాహయోస్సతోః, రథమభితః - రథస్య సమన్తాదిత్యర్థః. ॥ సూ ॥ అభితఃపరితఇత్యాదినా ద్వితీయా. రక్షిణః - పాలకాన్, సమాదిశ్య - ఆజ్ఞాప్య, లఙ్కాం ప్రవిశ్య, విచిత్రాభిః - అద్భుతాభిః, ఆహుతిభిః, విధిమర్హతీతి విధివత్ - యథాశాస్త్రమ్ ॥ వ్యా ॥ తదర్హతీతి వతిప్రత్యయః. అర్చితేన - పూజితేన, సప్తార్చిషా - అగ్నినా, సమర్పితః - ప్రతిపాదితః, శస్త్రాస్త్రాణాం సమ్భారః - సమూహః యస్మై తథోక్తః, పునః సఙ్గ్రామభూమిమ్ - యుద్ధరఙ్గమ్, ఏత్య - ప్రాప్య, హేమన్తసమయ ఇవ, చాపస్య - ధనుషః, ఆగమేన - ప్రాప్త్యా, యద్వా, చాపాగమేన - ధనుర్విద్యయా, సముజ్జృమ్భమాణైః - అభివర్ధమానైః, అన్యత్ర చాపాగమేన -

రేత్య సఙ్గ్రామభూమిం హేమన్తసమయ ఇవ చాపాగమసముజ్జృమ్భమాణైరన్తరితదిగన్తరిక్షాన్తరాళైరిషుతుషారైరవలుమ్పన్ రాజహంసయోస్తేజఃప్రకర్షమస్త్రేణ చ వైరిఞ్చేన సైన్యమఖిలమాలేఖ్యవిన్యస్తమివ విరచయ్య క్షణేన పరావవృతే ॥ ౧౮౬ ॥ తదను ముహూర్తమాత్ర ప్రతిపాలితతదస్త్రబన్ధేన గన్ధవహనన్దనేన నిష్ప్రతీకారవి

---

ధనుస్సఙ్క్రమణేన, సముజ్జృమ్భమాణైః. అన్తరితమ్ - ఆచ్ఛాదితమ్, దిశామ్ - ఆశానామ్, అన్తరిక్షస్య - గగనస్య చ, అన్తరాళమ్ - మధ్యప్రదేశః, యైస్తైస్తథోక్తైః. అతినిబిడతయా దిగన్తరమాచ్ఛాదయద్భిరిత్యుభయత్రతుల్యమ్, ఇషుభిరేవ తుషారైరితి రూపకమ్. రాజహంసయోః - రాజశ్రేష్ఠయోః రామలక్ష్మణయోః, అన్యత్ర రాజహంసయోః - హంసశ్రేష్ఠయోః, తేజఃప్రకర్షమ్ - ప్రతాపాతిశయమ్, అన్యత్ర కాన్త్యతిశయమ్, అవలుమ్పన్ - నాశయన్, హిమనిపాతేన రాజహంసా జర్ఝరపత్రా భవన్తీతి ప్రసిద్ధిః; వైరిఞ్చేన - బ్రహ్మదేవతాకేన, సాస్యదేవతేత్యణ్. అస్త్రేణ, అఖిలం సైన్యమ్ - సర్వం వానరబలమ్, ఆలేఖ్యే - చిత్రకర్మణి, విన్యస్తమ్ - సమర్పితమివ, విరచయ్య - కృత్వా, స్తమ్భీకృత్యేత్యర్థః. క్షణేన - క్షణకాలేన, పరావవృతే - ప్రతినివృత్తః ॥ ౧౮౬ ॥

తదన్వితి ॥ తదను - బ్రహ్మాస్త్రబన్ధేననిఖిలసైన్యవిష్టమ్భనానన్తరమ్, ముహూర్తమేవ ముహూర్తమాత్రమ్ - ముహూర్తకాలపర్యన్తమిత్యర్థః. ప్రతిపాలితః - నిరీక్షితః, తదస్త్రస్య - బ్రహ్మాస్త్రస్య, బన్ధః యేన తథోక్తేన, పితామహవరప్రసాదవినివారితోఽప్యస్త్రబన్ధః గౌరవాత్ కఞ్చిత్కాలం ప్రతిపాలిత ఇతి భావః. నిష్ప్రతీకారః - ప్రతిక్రియాశూన్యః, యో విపదేవ అకూపారః - సముద్రః, ॥ ని ॥ సముద్రోఽబ్ధిరకూపార ఇత్యమరః. తస్మిన్ సంమగ్నానాం స్వజనానాం సముద్ధరణాయ - విపదస్సముత్తరణాయేత్యర్థః. ఏకమ్ -

పదకూపారసమ్మగ్నస్వజనసముద్ధరణైకలబ్ధజన్మనా విభీషణవచనసుధాసేకసమాశ్వాసితజామ్బవదభిహితాం దవీయసీమపి పదవీమచిరాదతిలఙ్ఘ్య కైలాసగిరిపర్యన్తవర్తిని సమూలమున్మూలితే సమానీతేచ సలీలమోషధిపర్వతే పరిసరపరిస్పన్దమానపవమానమాణవకసమాహృతతదగ్రశిఖరదేదీప్యమానదివ్యౌషధిగన్ధేన ఘ్రాణగ్రాహి

ముఖ్యంయథాతథా ॥ ని ॥ ఏకేముఖ్యాన్యకేవలాఇత్యమరః. లబ్ధమ్-ప్రాప్తమ్, జన్మ-ఉత్పత్తిః, యేనతథోక్తేన; స్వజనవిపదుద్ధరణైకఫలకజనుషేత్యర్థః. గన్ధవహనన్దనేన - హనూమతా, విభీషణస్య వచనమ్ - సమాధానోక్తిరేవ, సుధా, తస్యాస్సేకేన - సేచనేన హేతునా, సమాశ్వాసితేన - శాన్తమూర్ఛేన, జామ్బవతా, అభిహితామ్ - సప్రపఞ్చంప్రతిపాదితామ్, దవీయసీమ్-అతిదూరవ్యాపినీమపీత్యర్థః. ॥ వ్యా ॥ దూరశబ్దాదీయసుని స్థూలదూరేత్యాదినాయణాదిపరలోపే పూర్వస్యగుణః. పదవీమ్ - పన్థానమ్, ॥ ని ॥ పన్థానఃపదవీసృతిరిత్యమరః. అచిరాత్ - శీఘ్రమ్, అతిలఙ్ఘ్య - అతిక్రమ్య, కైలాసగిరేః పర్యన్తవర్తిని - సమీపస్థితే, ఓషధిపర్వతే, సలీలంయథాతథా, ఉన్మూలితే - ఉత్పాటితే, సమానీతే - ఆహృతేసతిచ, ఘ్రాణంగృహ్ణాతీతి ఘ్రాణగ్రాహి ॥ వ్యా ॥ తాచ్ఛీల్యేణినిః. తాదృశేన ఘ్రాణేన్ద్రియాహ్యయకేనేత్యర్థః. పరిసరే - పర్యన్తభూమౌ, ॥ ని ॥ పర్యన్తభూఃపరిసరఇత్యమరః, పరిస్పన్దమానేన - కిఞ్చిత్సఞ్చరమాణేన, పవమానమాణవకేన - మన్దమారుతేనేత్యర్థః. ॥ ని ॥ బాలస్తుస్యాన్మాణవకఇత్యమరః, సమాహృతేన - ఆనీతేన, తస్య - శైలస్య, అగ్రంచతత్ శిఖరంచేతికర్మధారయః, హస్తాగ్రాగ్రహస్తయోర్గుణగుణినోర్భేదాభేదాదితివామనసూత్రాత్సమానాధికరణస్సమాసః. తస్మిన్ దేదీప్యమానానామ్ - భృశంప్రకాశమానానామ్, ॥ వ్యా ॥ దీపీదీప్తావితిధా

ణా నివృత్తనిఖిలజరామరణక్లేశాస్సర్వేపి ప్రకృతిమలభన్త ॥ ౧౪౬ ॥
॥ ప ॥ భృత్యబాన్ధవమిత్రేషు తాదృగేకోపి దుర్లభః । రాజ్ఞాం విపత్సు
యో ధీరం హనూమానివ చేష్టతే ॥ ౧౪౭ ॥ గ ॥ తదను దివ్యౌషధి
సౌరభాఘ్రాణనవీకృతభుజవీర్యైర్హరివర్యైస్సుగ్రీవాజ్ఞయా దహ్య
మానాయాం లఙ్కాయాం సమ్భావ్య పితృవ్యనిదేశం సమీకాభిము

---

తోర్వ్యజస్తాల్లటశ్శానచ్ దివ్యౌషధీనామ్ - సన్ధానకరణ్యాద్యోషధిలతానామ్, గన్ధేన నివృత్తః - ప్రశాన్తః, నిఖిలః - సర్వః, జరామరణయోః క్లేశః యేషాం తథోక్తాస్సన్తః, ప్రకృతిమ్ - స్వభావమ్, అలభన్త - ప్రాప్తవన్తః, ఓషధిగన్ధమాఘ్రాయ వృద్ధా అపి తరుణాయన్తేస్మ; మృతా అపి పునరుజ్జిజీవురిత్యర్థః. ॥ ౧౪౬ ॥

అథ తాదృశస్వజనవిపత్సముద్ధర్తారమోషధిగిరిహర్తారమేవకవిర్విశినష్టి — భృత్యేతి ॥ భృత్యాః - కర్మకరాః, బాన్ధవాః - దేహసమ్బన్ధినః, మిత్రాణి - సమసుఖదుఃఖాజనాః, తేషుమధ్యే యతశ్చనిర్ధారణఇతి నిర్ధారణేసప్తమీ. తాదృక్ ఏకోపి పుమాన్ దుర్లభః - లబ్ధుమశక్యః, యఃపుమాన్ రాజ్ఞాంవిపత్సు - విపత్సమయేష్విత్యర్థః. ధీరంయథాతథా, హనూమాన్ - ఆఞ్జనేయఇవ, చేష్టతే - ఉపకర్తుం వ్యాప్రియతఇత్యర్థః. తాదృగితి పూర్వేణసమ్బన్ధః. ॥ ౧౪౭ ॥

తదన్వితి ॥ తదను - కపివీరాణాం యథాపురమవస్థానానన్తరమ్, సుగ్రీవస్య ఆజ్ఞయా, దివ్యౌషధీనామ్ - సన్ధానకరణ్యాదీనామ్, సౌరభస్య - గన్ధస్య, ఆఘ్రాణేన నవీకృతమ్ - నూతనంకృతమ్, భుజవీర్యమ్ - బాహుపరాక్రమః, యేషాంతథాభూతైః. హరివర్యైః - వానరోత్తమైః, లఙ్కాయాం దహ్యమానాయాం సత్యామ్. పితృవ్యస్య - పితృభ్రాతూ రావణస్య, ॥ ౨ ॥ పితృభ్రాతా పితృవ్యస్స్యాదిత్యమరః. పితృవ్యమాతులమాతామహపి

ఖౌ శ్లాఘనీయసమరసంరమ్భౌ కుమ్భనికుమ్భౌ నామ కుమ్భకర్ణతనుసమ్భవౌ నిజసాహాయ్యానుగతప్రజఙ్ఘాకమ్పనశోణితాక్షయూపాక్షనిధననిశమనద్విగుణితప్రతిఘానలప్రపఞ్చితదోర్విక్రమౌ క్రమేణ తపనపవనతనయనయనగోచరావభవతామ్ ॥ ౧౪౯ ॥ ప ॥ పరచక్రేభ

---

తౌ మహౌజ ఇతి నిపాతనాత్సాధుః. నిదేశమ్ - ఆజ్ఞామ్, సమ్భావ్య - సమ్పూజ్య, శిరసాధృత్వేత్యర్థః. సమీకాభిముఖౌ - యుద్ధోన్ముఖౌ, ॥ ని ॥ మృధమాస్కన్దనం సంఖ్యం సమీకం సామ్పరాయికమిత్యమరః. శ్లాఘనీయః - శ్లాఘార్హః, ॥ వ్యా ॥ అర్హేకృత్యతృచశ్చేత్యనుశాసనాత్ అర్హార్థే అనీయర్ప్రత్యయః. సమరసంరమ్భః - యుద్ధోద్యోగః, యయోస్తౌ తాదృశౌ. కుమ్భనికుమ్భౌ నామ నామేతి ప్రసిద్ధావవ్యయమ్. కుమ్భకర్ణస్య తనుసమ్భవౌ - ఆత్మజౌ, నిజసాహాయ్యార్థమ్, అనుగతానామ్ - అనుసృత్యాగతానామ్, ప్రజఙ్ఘాకమ్పనశోణితాక్షయూపాక్షాణామ్ - రక్షోవిశేషాణామ్, నిధననిశమనేన - మరణవార్తాశ్రవణేనేత్యర్థః. ద్విగుణితేన పునరుక్తేన, ప్రతిఘానలేన - క్రోధాగ్నినా, ॥ ని ॥ ప్రతిఘారుట్క్రుధౌ స్త్రియామిత్యమరః. పూర్వం యుద్ధకాలఏవ జాజ్వల్యమానః క్రోధానలస్తన్నిధననిశమనేనద్విగుణితఇత్యర్థః. ప్రపఞ్చితః - సంవర్ధితః, దోర్విక్రమః - బాహువీర్యమ్, యయోస్తాదృశౌ సన్తౌ, క్రమేణ - యథాక్రమమిత్యర్థః. విభక్తిప్రతిరూపకమవ్యయమ్. తపనపవనతనయయోః - సుగ్రీవహనూమతోః, నయనగోచరౌ - చక్షుఃప్రత్యక్షవిషయౌ సన్తౌ, అభవతామ్ - బభూవతుః, కుమ్భస్సుగ్రీవేణ నికుమ్భో హనూమతా చ యథాక్రమం దృష్టావిత్యర్థః. ॥ ౧౪౯ ॥

అథ సుగ్రీవేణ కుమ్భవధమాహ — పరచక్ర ఇతి ॥ పరేషామ్ - అరీణామ్, చక్రే - సైన్యే, అన్యత్ర పరే - శ్రేష్ఠే, చక్రే - ఘటసాధనే, ॥ ని ॥ పరః శ్రేష్ఠారిదూరాన్యోత్తరేక్లీబం తు కేవల ఇత్య

జదణ్డభ్రమితం కుమ్భంపయోధరాకారమ్। రన్ధ్రదృశా కపిపతినా
క్షిప్తం జగ్రాహదణ్డధరఏవ ॥ ౧౫౦ ॥ గ ॥ అథ నికుమ్భేఽపి ప్రభ
ఞ్జనసుతేన సహోదరసరణిముపనీతే శిరసా ప్రతిగృహ్య భర్తృశాసన

---

భయత్రాపి మేదినీ ॥ ని ॥ చక్రఞ్చ యోజలావర్తే రథాఙ్గేరాష్ట్రసై
న్యయోః। ఘటసాధనభేదేపి క్లీబేకోకేపిపుంస్యయమిత్యుభయత్రా
పినానా. భుజదణ్డేన - దణ్డసదృశబాహునా, అన్యత్ర భుజస్థితదణ్డేన,
భ్రమితమ్ - ఆవర్తితమ్, పయోధరాకారమ్ - జలధరసమానవర్ణ
మ్, అన్యత్ర కామినీకుచసదృశమ్ ॥ ని ॥ స్త్రీస్తనాబ్దౌపయోధరా
వితినానా. రన్ధ్రమ్ - ఛిద్రమ్ ॥ ని ॥ ఛిద్రంనిర్వ్యథనంరోకొరన్ధ్ర
మిత్యమరః. పశ్యతీతి రన్ధ్రదృక్, కర్తరిక్విప్. తేన రన్ధ్రాన్వేషి
ణా, అన్యత్ర ఛిద్రదర్శినా, కపిపతినా - సుగ్రీవేణ, అన్యత్ర కముదకం
పిబన్తీతి కపయః - జలపాయినః, తేషాం పతిః - శ్రేష్ఠః, జలాభిలా
షిణాం జలప్రదాతేత్యర్థః. తేన క్షిప్తమ్ - అధోనిపాతితమ్, అన్య
త్ర క్షిప్తమ్ - విసృష్టమ్, జలాదానానుపయోగాదితిభావః. కుమ్భ
మ్ - కుమ్భాభిధం రాక్షసమ్, అన్యత్ర ఘటమ్, ॥ ని ॥ కుమ్భఃకుఞ్జ
రమూర్ధాగ్రే కుమ్భకర్ణసుతే ఘటఇతినానా. దణ్డధరః - అన్తకఏ
వ, అన్యత్ర దణ్డస్య - చక్రభ్రమణోపకరణీభూతాయా యష్టేః,
ధరః - ధర్తా కులాలఏవ, జగ్రాహ - గృహీతవాన్, విక్రేత్రా
సరన్ధ్రత్వాత్త్యక్తం కుమ్భం కుమ్భకారఏవ స్వీచకారేత్యేతదు
క్తమేవేతి భావః. అత్ర ఏకనాళావలమ్బిఫలద్వయవదేకశబ్దేనోభ
యార్థప్రతీతేః ప్రకృతాప్రకృతగోచరోఽయమర్థశ్లేషః ॥ ౧౫౦ ॥

అథేతి ॥ అథ - కుమ్భవధానన్తరమ్, నికుమ్భేఽపి - కుమ్భా
వరజే రాక్షసేఽపి, ప్రభఞ్జనసుతేన - హనూమతాకర్త్రా, సహో
దరస్య - నిజభ్రాతుఃకుమ్భస్య, సరణిమ్ - పద్ధతిమ్, యమపురీ
మార్గమిత్యర్థః. ॥ ని ॥ సరణిఃపద్ధతిఃపద్యేత్యమరః. ఉపనీతే -

మవతీర్ణరణవసుధ్ధరాతలం కిమేభిః పశుభిరాహవేఽజితైరపి యశో భృ
శమోజస్వినామితి వానరానున్ముచ్య, జనస్థానస్థచతుర్దశసహస్రసే
నాధ్యక్షస్య పితుర్వా మమ నిహన్తృతయా శూరజనరేఖావసానగణ
నీయతామాపన్నస్స మానవశిశుః క్వను నిలీన ఇత్యాత్మానమేవాన్విష్య

---

ప్రాప తేజసా, భర్తుః - రాజ్ఞో రావణస్య, శాసనమ్ - ఆజ్ఞామ్, శిరసా ప్రతిగృహ్య - సమ్మాన్యేత్యర్థః. అవతీర్ణరణవసుధరాతలమ్ - ప్రాప్తసమరాజిరాణామ్, ఆహవే - యుద్ధే, విజితైరపి ఏభిః పశుభిః - వానరైః, అనాఘ్రాతసమరసౌరభాణామమీషాం జయేనాపీత్యర్థః. ఓజః - బలమ్, అవష్టమ్భో వా, ॥ ని ॥ ఓజో దీప్తావవష్టమ్భే ప్రకాశబలయోరపీతి మేదినీ. తద్వతామ్ - ఓజస్వినామ్, అస్మాకమితి భావః. ॥ సూ ॥ అస్మాయామేధాస్రజో వినిరితి వినిప్రత్యయః. కిం భృశం యశః - కా వా మహతీ కీర్తిః భవేత్, న కాపీత్యర్థః. ఉక్తంచ “ నానోననునోన్నునోన్ననః । శ్వానారోహే కుతో మానః పతనే తావ మానితా ” ఇత్యాది. ఇత్యేవమభిప్రాయేణ, వానరాన్ ఉన్ముచ్య - త్యక్త్వా, తైస్సహ అయుద్ధ్వేత్యర్థః. జనస్థానే తిష్ఠతీతి జనస్థానస్థః, ॥ సూ ॥ సుపిస్థ ఇతి కప్రత్యయః. యా చతుర్దశసహస్రాణామ్ - చతుర్దశసహస్రసఙ్ఖ్యాకానామ్, రక్షసాం సేనా, తస్యాః అధ్యక్షస్య - నాయకస్య, వా - అథవా, మమపితుః - మజ్జనకస్య ఖరస్యేత్యర్థః. న కేవలం చతుర్దశసహస్రసేనాధ్యక్షత్వాదేవ ఖరో న శూరః, కిన్తు మజ్జనకత్వాచ్ఛూర ఇతి మన్తవ్య ఇతి భావః. నిహన్తృతయా - సంహారకత్వేన, శూరజనరేఖాయాః - వీరలోకశ్రేణ్యాః, అవసానే - విరామే, గణనీయతామ్ - సఙ్ఖ్యేయత్వమ్, ఆపన్నః - ప్రాప్తః, మత్పితృనిహన్తృత్వాత్ శూరజనరేఖాయాం కుత్రాపి కథంచిద్గణ్యత ఇతి భావః. స మానవశిశుః - మనుష్యశాబకః, క్వ ను నిలీనః - కుత్ర వా ప్రచ్ఛన్నః, ఇతి - ఏవమ్, ఆత్మానమ్ - స్వమేవ,

ఘుష్యన్తం మకరాక్షంనామ ఖరాత్మజం ధురినిరీక్ష్య సమన్దస్మితమిదమాహ రామః ॥ ౧౫౧ ॥ వ ॥ నిరవధికపటధురన్ధరఖరహననే కా

---

అన్విష్య ఘుష్యన్తమ్ - గర్జన్తమ్, మకరాక్షంనామ, నామేతి ప్రసిద్ధౌ. ఖరాత్మజమ్ - ఖరసుతమ్, ధురి - అగ్రే ॥ ని ॥ ధూర్నా ధూపే స్త్రీతుకమ్బ్వ విత్తెభారెయుగాగ్రయోరితినానా. నిరీక్ష్య - దృష్ట్వా, రామః, సమన్దస్మితం యథాతథా, ఇదం - వక్ష్యమాణమ్, ఆహ ॥ వ్యా ॥ బ్రూఞ్ వ్యక్తాయాంవాచీతి ధాతోర్లట్. బ్రువఃపఞ్చానామాదిత ఆహోబ్రువఇత్యాహాదేశః. ॥ ౧౫౧ ॥

అథ తద్వచనప్రకారమేవాహ — నిరవధీతి ॥ నిరవధేః - అపారస్య, కపటస్య - కైతవస్య, ధురన్ధరస్య - ధూర్వహస్య, అతివేలంమాయావినఇత్యర్థః. ధురన్ధరశబ్దో వ్యాఖ్యాతః. ఖరస్య - తవపితుః, హననే - సంహారే, మమ కా శ్లాఘా - స్తుతిః, నకాపీత్యర్థః. వీరస్యహననే శ్లాఘాభవేత్, నహి కపటధురన్ధరస్యాస్యేతి భావః. కించ నిర్గతోఽవధిరవసానంయేభ్యస్తే నిరవధికాః ॥ సూ ॥ శేషికబితికప్; అనన్తాఇత్యర్థః. పటాః - వస్త్రాణి, తేషాం ధురన్ధరస్య - భారవాహినః, యద్వా, నిరవధికంయథాతథా పటధురన్ధరస్య - ఆజానమామరణాద్వస్త్రభారవహనఖిన్నస్య, ఖరస్య - గర్దభస్య, ॥ ని ॥ రాసభాగర్దభాఃఖరాఇత్యమరః. హననే కామమ్ - అత్యన్తమ్, అశ్లాఘా - శ్లాఘాభావఏవ. అత్రాభావార్థకొనఞ్. తదుక్తమ్ “ తత్సాదృశ్యమభావశ్చతదన్యత్వం తదల్పతా। అప్రాశస్త్యం విరోధశ్చనఞర్థాష్షట్ప్రకీర్తితాః” ఇతి. వస్త్రవహనేనైవ దీనస్య గర్దభస్య హననేన వీరాణాం పరంనిన్దైవ నస్తుతిరితిభావః. నిరవధికపటధురన్ధరఇత్యత్ర పదభఙ్గవైచిత్ర్యేణ ప్రతీయమానాభ్యామర్థాభ్యాం ఖరగర్దభయోస్సాదృశ్యంచ గమ్యతే. త్వం పితుః - ఖరాత్, అధికం శ్లాఘ్యః - శ్లాఘనీయః, శ్లాఘార్హఇత్యర్థః. అధి

మమ శ్లాఘా । పితురధికశ్లాఘ్యస్త్వం సఖరో ముఖరో యదద్య భవాన్ ॥ ౧౫౭ ॥ అథ రామశరశ్శౌరేశ్చక్రం నక్రమివావధీత్ ।

---

కశబ్దేన యోగే సప్తమీ పఞ్చమ్యౌ విధీయేతే, తస్మిన్నధికమితి యస్మాదధికమితి చ నిర్దేశాదిత్యుక్తత్వాత్పఞ్చమీ. యత్ - యస్మాత్కారణాత్, సః తవ పితా, ఖమ్ ముఖాన్తర్వర్తి ఆకాశమస్యాస్తీతి ఖరః ॥ ని ॥ అనన్తం సురవర్త్మ ఖమిత్యమరః. మహావదనాకాశవానిత్యర్థః. భవాన్ - అద్య - ఇదానీమ్, ముఖమస్యాస్తీతి ముఖరః - విశాలముఖవానిత్యర్థః. ॥ వ్యా ॥ రప్రకరణే ఖముఖకుఞ్జేభ్య ఉపసఙ్ఖ్యానమిత్యుభయత్రాపి మత్వర్థీయో రప్రత్యయః. ఖరముఖరశబ్దవాచ్యయోరుభయోరర్థసామ్యేఽపి, సఖరః త్వం ముఖర ఇతి వర్ణాధికశబ్దవాచ్యత్వాద్భవతః పితురధికశ్లాఘ్యతేత్యర్థః. అతస్త్వద్ధననే మమ కామం శ్లాఘా భవేదితి భావః. నిరవధికపటధురన్ధరఖరహననే ఇత్యత్ర ఏకవాక్యావలమ్బిఫలద్వయవదేకేనైవ శబ్దేనోభయార్థప్రతీతేరర్థశ్లేషః. కామమమశ్లాఘేత్యత్ర పదభఙ్గేనోభయార్థప్రతీతేశ్శబ్దశ్లేషః. ఖరనిన్దాపూర్వకం శ్లాఘ్యోఽసీత్యుక్త్యా విపరీతలక్షణయా నిన్దైవ గమ్యతే ॥ ౧౫౭ ॥

అథ మకరాక్షస్య వధమాహ — అథ రామస్య శరః - బాణః, శౌరేః - విష్ణోః, చక్రమ్ - సుదర్శనమ్, మహత్ సత్త్వమ్ - బలం యస్య తం తథోక్తమ్. అన్యత్ర మహచ్చ తత్ సత్త్వం చేతి కర్మధారయః. బృహజ్జలచరజన్తుమిత్యర్థః. ॥ సూ ॥ ఆన్మహత ఇత్యాదినా మహచ్ఛబ్దస్య ఆత్వమ్. ॥ ని ॥ సత్త్వం ద్రవ్యేఽపి శౌచాదౌ వ్యవసాయస్వభావయోః । గుణే ప్రాణిబలస్వాన్తసత్తాస్వస్త్రీ తు జన్తుష్వితి నానా. అనేకాని - బహులాని, పరుషాణి - నిష్ఠురాణి, ఉదితాని - జల్పితాని, యస్య తం తథోక్తమ్. ॥ ని ॥ ఉక్తం భాషితముదితం జల్పితమిత్యమరః. ॥ వ్యా ॥ వదేర్భావే క్తప్రత్యయే సమ్ప్రసార

మకరాక్షం మహాసత్త్వమనేకపరుషోదితమ్ ॥ ౧౫౩ ॥ హుత్వాపున
స్హుతవహాధిగతప్రసాదో గత్వారణం నభసి వాసవజిన్నిలీయ । నిర్మా

ణమ్. అన్యత్ర ఏకభిన్నమనేకమ్, తేనద్వాభ్యాంపిబతీతి అనేకపః - గజః, ॥ వా ॥ సుపిస్థఇత్యత్ర సుపీతి యోగవిభాగాత్కః. ॥ ని ॥ ద్విరదోఽనేకపోద్విపఇత్యమరః. తస్మిన్ రుషా - తద్విషయకోపేన, ఉదితమ్ - ఉత్థితమ్, ఉత్పూర్వాద్వదిణ్ ధాతోర్గత్యర్థాకర్మకేత్యాదినాకర్తరిక్తః. మకరాక్షమ్-తన్నామానం ఖరసుతమ్, నక్రం - కుమ్భీరమివ ॥ ని ॥ గ్రాహోవహారోనక్రస్తుకుమ్భీరఇత్యమరః. అవధీత్ - జఘాన, హన్తేః కర్తరిలుఙ్. ॥ సూ ॥ హనోవధలుఙీతివధాదేశః. పురాఖలు కేనచిన్నక్రేణ హింస్యమానః క్రన్దన్ కుఞ్జరశ్చక్రేణ నక్రం హత్వా భగవతా రక్షితఇతి పౌరాణికీ కథానుసన్ధేయా. అత్ర అనేకపరుషోదితమిత్యత్ర పదభఙ్గాపేక్షత్వాత్సభఙ్గశ్లేషః. మహాసత్త్వమిత్యత్ర తదభావాదభఙ్గశ్లేషః. తౌచనక్రమిత్యుపమాయా అఙ్గమితి సఙ్కరః. ॥ ౧౫౩ ॥

హుత్వేతి ॥ వాసవజిత్ - రావణిః, పునః హుత్వా - అగ్నిమాహుత్యా సమ్పూజ్యేత్యర్థః. వహతీతివహః పచాద్యచ్; హుతస్యవహః హుతవహః - అగ్నిః, కర్మణశ్శేషత్వవివక్షాయాం షష్ఠీసమాసః. తస్మాత్ అధిగతః - ప్రాప్తః, ప్రసాదః - అనుగ్రహః, రథచాపాదిరూపః, యేనతథోక్తస్సన్. ॥ ని ॥ ప్రసాదోఽనుగ్రహః కావ్యప్రాణస్వాస్థ్యం ప్రసన్నతేతినానా. రణప్రయాణసమయే ఇన్ద్రజితాపూజితోఽగ్నిస్తస్మైరథచాపాస్త్రాణి దదాతీతి ప్రసిద్ధిః. రణమ్ - సమరమ్, గత్వా - ప్రాప్య, నభసి - అన్తరిక్షే, నిలీయ - మాయయా ఆత్మానం ప్రచ్ఛాద్యేత్యర్థః; స్వయం పరైరదృష్టఇతియావత్. పరేషాం - శత్రూణామిత్యర్థః. మర్మసు - మర్మస్థానేషు, విశిఖైః - శరైః, భిదామ్ - భేదనమ్, ॥ సూ ॥ షిద్భిదాదిభ్యోఽఙ్

యమర్మసు ఖిద్యాం విశిఖైరేవ తేషాం మత్వా చ రాఘవరుషం పరుషాం
ప్రతస్థే ॥ ౧౫౪ ॥ ౫ ॥ అథ నికుమ్భిలాయాం మహావిధినా హుత
వహం సమారాధ్య దుర్జయతా మర్జయితుం ఛద్మనా ప్రతార్య సర్వాన

---

ఇత్యిఞ్ ప్రత్యయః. నిర్మాయ - కృత్వా, శత్రూన్ మర్మసు నిర్భిద్యే
త్యర్థః. పరుషామ్ - క్రూరామ్, రాఘవస్య - లక్ష్మణస్య రామభ
ద్రస్య వా, ఉభయోర్వా, రుషమ్ - కోపమ్, తథా చోక్తం శ్రీరా
మాయణే ॥ శ్లో ॥ "లక్ష్మణస్తు సుసంక్రుద్ధో భ్రాతరం వాక్యమబ్రవీ
త్ । బ్రాహ్మమస్త్రం ప్రయోక్ష్యామి వధార్థం సర్వరక్షసామ్ ॥"
తతశ్చ రామభద్రేణోక్తం తత్రైవ "నైకస్య హేతో రక్షాంసి పృ
థివ్యాం హన్తుమర్హసి । అస్యైవ తు వధే యత్నం కరిష్యావో మహాబల ॥
యద్యేష భూమిం విశతే దివం వా రసాతలం వాపి నభస్తలం వా । ఏ
వం నిగూఢోఽపి మమాస్త్రదగ్ధః పతిష్యతే భూమితలే గతాసుః ॥ ఇత్యే
వముక్త్వా వచనం మహాత్మా రఘుప్రవీరః ప్లవగోత్తమైర్వృతః । వధా
య రౌద్రస్య నృశంసకర్మణస్తదా మహాత్మా త్వరితం నిరీక్షతే ॥"
ఇతి. మత్వా - జ్ఞాత్వా చ, ప్రతస్థే - ప్రయయౌ. ప్రపూర్వాత్తిష్ఠ
తేర్లిట్. ॥ సూ ॥ సమవప్రవిభ్యస్థ ఇత్యాత్మనేపదమ్ ॥ ౧౫౪ ॥

అథేతి ॥ అథ - పురప్రాప్త్యనన్తరమ్, సుత్రామజిత్ - ఇ
న్ద్రజిత్, నికుమ్భిలాయామ్ - నికుమ్భిలాఖ్యాయాం స్థల్యామ్,
మహావిధినా - మహతా విధానేన, శత్రుమారణయోగరూపేణేత్య
ర్థః. ॥ ని ॥ విధిర్విధానే దైవే చేత్యమరః. హుతవహమ్ - అగ్నిమ్,
ఆరాధ్య - పూజయిత్వా, దుర్జయతామ్ - పరైర్జేతుమశక్యత్వమ్,
అర్జయితుమ్ - సమ్పాదయితుమ్, సర్వాన్ - అఖిలాన్ శత్రూనిత్య
ర్థః. ఛద్మనా - కపటేన, ॥ ని ॥ కపటోఽస్త్రీ వ్యాజదమ్భోపధయ
శ్ఛద్మకైతవ ఇత్యమరః. ప్రతార్య - వఞ్చయిత్వా, అవసరమ్ - స
మయమ్, విధివద్యాగనిర్వహణార్థమితి భావః. అధిగన్తుమ్ - ప్రా

వసరమధిగన్తుకామస్సుత్రామవైరీ రథోపరి పరికల్ప్య మాయామయీం మైథిలీం నిష్క్రమ్య పశ్చిమదిగ్గోపురాదాఞ్జనేయస్య పురతస్సావష్టమ్భమాకృష్య కోశాత్కరాళకరవాళలతాం, హా నాథ! హా మదర్థఖణ్డితఖణ్డపరశుకోదణ్డ! హా మిథిలానగరజనలోచనాసేచ

---

ప్త్రమ్, కామోయస్యసః తథోక్తః. రథస్య ఉపరి - ఊర్ధ్వభాగే, సుప్సుపేతిసమాసః. మాయా - మోహనవిద్యా, ॥ ని ॥ స్యాన్మాయా శామ్బరీతివిశ్వః. తస్యాః ఆగతాం మాయామయీమ్, మాయాపరికల్పితామిత్యర్థః. ॥ వ్యా ॥ తతఆగతఇత్యధికారే మయట్చేతివిధానాన్మయట్; టిడ్ఢాణఞిత్యాదినా ఙీప్. మైథిలీమ్ - సీతామ్, పరికల్ప్య - స్థాపయిత్వేత్యర్థః. పశ్చిమదిగ్గోపురాత్ - పశ్చిమదిగ్వర్తిపురద్వారాత్, నిష్క్రమ్య - బహిర్నిర్గత్య, అఞ్జనాయాః అపత్యం ఆఞ్జనేయః - హనూమాన్, స్త్రీభ్యోఢగితిఢక్. తస్య పురతః - పురోభాగే, కరాళామ్ - ఘోరామ్, కరవాళః - కృపాణః, ॥ ని ॥ కౌక్షేయకో మణ్డలాగ్రః కరవాళః కృపాణవదిత్యమరః. స ఏవ లతేవేత్యుపమితసమాసః. తాం కోశాత్ - పిధానాత్, ॥ ని ॥ కోశోస్త్రీకుట్మలే ఖడ్గపిధానేఽర్థౌఘదివ్యయోరిత్యమరః. సావష్టమ్భమ్ - సగర్వం యథాతథా, ఆకృష్య, హా నాథ! హేతిఖేదే, ॥ ని ॥ హా విషాదశుగార్తిష్విత్యమరః. ఏవమగ్రేపి, హా మదర్థమ్ - మత్పాణిగ్రహణార్థమిత్యర్థః. ఖణ్డితమ్ - భిన్నమ్, ఖణ్డపరశోః - ఈశ్వరస్య, ॥ ని ॥ భూతేశః ఖణ్డపరశురిత్యమరః. కోదణ్డమ్ - ధనుః, యేనతథోక్తః; తస్య సమ్బుద్ధిః. హా మిథిలానగరజనానామ్ - మిథిలాపురీవాస్తవ్యానామ్, లోచనయోః, ఆసేచనక - తైరత్యాదరాదతృప్త్యదిభిర్ద్రష్టఇత్యర్థః. తదుక్తమ్ " తదాసేచనకం తృప్తేర్నాస్త్యన్తో యస్యదర్శనాత్" ఇతి. హా భృగోః గోత్రాపత్యం భార్గవః - జామదగ్న్యః, సఇత్యపదేశో వ్యాజో య

నక! హా భార్గవాపదేశకాలసర్పదర్పవిషనిషూదన! హా చిత్రకూట శిఖరవనోద్దేశతరులతామాత్రసాక్షికప్రణయసార! హా విరాధఖణ్డన! హాగోదావరీనిర్మలవాలుకావిహారవినోదప్రియసఖ! హానిమిషమాత్ర నిర్మక్షికీకృతజనస్థాన! తవాపి ప్రియగృహిణ్యాఅనాథాయా ఇవ దారుణేన రక్షసా మృత్యురేవంవిధఇతి నమో భవితవ్యతాయై, స్వస్తి

---

స్య తథోక్తః; యః కాలసర్పః - కృష్ణసర్పః, తస్య దర్పః - గర్వప, విషమ్ - గరళమితిరూపకమ్, తస్య నిషూదన - పరిహారక, హా చిత్రకూటస్య - గిరేః, వనోద్దేశే - వనప్రదేశే, యేతరవః - వృక్షాః, లతాః - వీరుధః, తాఏవ తరులతామాత్రం నాన్యదిత్యర్థః. సాక్షీ యస్యస తత్సాక్షికః ॥ సూ ॥ శేషెకబితికప్. ప్రణయస్య - ప్రీతేః, సారః - స్థిరాంశః యస్య తథోక్తః. చిత్రకూటవనస్య వివిక్తత్వాదతి విస్రబ్ధకృతక్రీడేత్యర్థః. హా విరాధస్య - తన్నామ్నోరాక్షసస్య, ఖణ్డన - భఞ్జక; హా గోదావర్యాః, నిర్మలవాలుకాసు - విశదసికతాసు, ॥ ని ॥ వాలుకా సికతాసుస్యాత్ర్పీ- లెచ హరివాలుకేతివానా. విహారవినోదె - క్రీడావిలాసె, ప్రియసఖ ॥ సూ ॥ రాజాహస్సఖిభ్యష్టచితిటచ్ సమాసాన్తః. హా నిమిషమాత్రె - స్వల్పకాలపవేత్యర్థః. నిర్మక్షికీకృతమ్ - మక్షికాశూన్యంకృతమ్, జనస్థానమ్ - లఙ్కాశాఖానగరమ్, యేన తథాభూత, జనస్థానస్థిత మక్షికా అపి వినాశితాస్త్వయా కిముత రాక్షసా ఇతిభావః. తవాపి, అపిశబ్దేన సమస్తరక్షఃకులవిత్రావణదక్షస్యాపీతి జ్ఞాయతే. ప్రియగృహిణ్యాః - ప్రియపత్న్యాః, అనాథాయాః - అశరణాయాఇవ, దారుణేన - క్రూరేణ, రక్షసా ఏవంవిధః - శస్త్రేణ కణ్ఠచ్ఛేదనరూపఇత్యర్థః. మృత్యుః - మరణమ్, ఇతిహేతోః నమోభవితవ్యతాయై - విధయే నమః, స్వస్తిమన్థరాయై - కుబ్జాయైక్షేమమస్తు, ఏతావదనర్థమూలత్వాదితిభావః. ॥ సూ ॥ నమస్స్వస్తీత్యాదినా ఉ

మన్థరాయా ఇతి తారముత్క్రోశన్తీం ముహుర్ముహురాలక్ష్య పవన తనయమశ్రుధారాముత్సృజన్తీం గృహీతకేశకలాపాం తామితికర్తవ్యతామివ మారుతతనయస్య కదలీలావమలావీత్ ॥ ౧౫౫ ॥ తదను ధీమానపి హనూమానతథ్యమపి తథ్యమవధార్య చణ్డాలగ్రస్త

---

భయితోఽపి చతుర్థీ. ఇతి - ఏవం ప్రకారేణ, మన్థగాయై ఇత్యత్ర ॥ సూ ॥ ఏచోఽయవాయావ ఇత్యాయాదేశే లోపశ్శాకల్యస్యేత్యనేన వైకల్పికే యలోపే మన్థరాయా ఇతి సిద్ధమ్. తారమ్ - ఉచ్చైః, ॥ ని ॥ తారోఽత్యుచ్చైస్త్రయస్త్రిషు ఇత్యమరః. ఉత్క్రోశన్తీమ్ - ఉచ్చైఃష్యరుదన్తీమిత్యర్థః. ముహుర్ముహుః పవనతనయమ్ - ఆఞ్జనేయమ్, ఆలక్ష్య - దృష్ట్వా, అయం వా మోచయేన్మామితి భావః. అశ్రుధారామ్ - బాష్పధారామ్, ఉత్సృజన్తీమ్ - విసృజన్తీమ్, గృహీతః కేశానాం కలాపః - సమూహః, యయా స్తాం తథోక్తామ్; కేశే గృహీతామిత్యర్థః. తామ్ - మాయారచితాం మైథిలీమ్, మారుతతనయస్య - మారుతేః, ఇతి కర్తవ్యతామ్ - వివేకమివ, కదలీమివ లూత్వా కదలీలావమ్, అలావీత్ - చిచ్ఛేద. కదలీకాణ్డవదనాయాసేన చకర్తేత్యర్థః. ॥ వ్యా ॥ లూఞ్ ఛేదనే ఉపమానే కర్మణి చేతి ణముల్. కషాదిషు యథావిధ్యనుప్రయోగ ఇతి లూఞోఽనుప్రయోగః, లుఙ్. సిచివృద్ధిః పరస్మైపదేష్వితి వృద్ధిః. ॥ ౧౫౫ ॥

తదన్వితి ॥ తదను - అనన్తరమ్, ధీమానపి - ఇదమిత్థమితి యథావస్థితం జ్ఞాతాపీత్యర్థః. హనూమాన్, అతథ్యమ్ - అసత్యమపి, మాయామయత్వాదితి భావః. అనార్యమ్ - నీచమ్, తత్కృత్యమ్, తథ్యమ్ - సత్యం సత్, అవధార్య - నిశ్చిత్య, ఇదం సత్యమేవేతి నిశ్చయేనజ్ఞాత్వేత్యర్థః. చణ్డాలగ్రహేణ - చణ్డాలపిశాచేన, ॥ ని ॥ గ్రహోఽనుగ్రహనిర్బన్ధగ్రహణేషు రణోద్యమే । సూర్యాదౌ పూతనాదౌ చ సైంహికేయవరాగయోరితి శేషః. గ్రస్తః -

ఇవ చణ్డాలగ్రహేణ శప్తఇవ మహర్షిభిః పాపరాధఇవ గురుజనేషు ప్రత్యాఖ్యాతఇవ రాజసభాయాం మగ్నోత్థితఇవ మహాహ్రదే, భగ్నోద్యమఇవ లాభప్రవృత్తిషు ఖలైరపహృతసర్వస్వఇవచ తస్కరైః ప్రాకృతలోకసాధారణ్యేన జడీకృతః కతిపయేషు క్షణేషు పశ్చాదుద్బుద్ధభయఙ్కరరోషావేశసముత్పాటితవిశాలశిలాచక్రస

---

ఆవిష్టఇవ, మహర్షిభిః - బ్రహ్మర్షిభిః, శప్తః - ఆక్రుష్టఇవ, గురుజనేషు - మహాత్మసు, పాపరాధఇవ, రాజసభాయాం ప్రత్యాఖ్యాతః - నిరాకృతఇవ, ॥ ని ॥ ప్రత్యాఖ్యాతో నిరాకృతఇత్యమరః. మహాహ్రదే - అగాధజలాశయే, ॥ ని ॥ జలాశయో జలాధారస్తత్రాగాధజలే హ్రదఇత్యమరః. మగ్నోత్థితఇవ, మగ్నశ్చాసావుత్థితశ్చేతి పూర్వకాలేత్యాదినా సమాసః. లాభస్య ప్రవృత్తిషు - ప్రసక్తిషు, ఖలైః - దుష్టైః, భగ్నోద్యమః - ప్రతిహతోద్యోగఇవ, తత్ చౌర్యం కరోతీతి తస్కరః ॥ సూ ॥ కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యేష్వితి టప్రత్యయః ॥ వా ॥ తద్బృహతోః కరపత్యోశ్చోరదేవతయోరితి సుడాగమః. తైః - చోరైరిత్యర్థః. ॥ ని ॥ చోరైకాగారికస్తేనదస్యుతస్కరమోషకాఇత్యమరః. అపహృతమ్ - బలాత్స్వీకృతమ్, సర్వస్వమ్ - అఖిలధనమ్, యస్య తథోక్తఇవ ॥ ని ॥ స్వోస్త్రియాం ధనేఇత్యమరః. ప్రాకృతలోకాః - పామరజనాః, తేషాం సాధారణ్యేన - సామ్యేన, కతిపయేషు క్షణేషు - కాలవిశేషేషు, జడీకృతః - స్తమ్భీకృతఇత్యర్థః. పశ్చాత్ - అనన్తరమ్, ఉద్బుద్ధః - ఉత్థితః, యః భయం కరోతీతి భయఙ్కరః - భీతిజనకః, ॥ సూ ॥ మేఘర్తిభయేషు కృఞ ఇతి ఖచ్. రోషావేశః - క్రోధాభినివేశః, తేన హేతునా, సముత్పాటితస్య - సమున్మూలితస్య, విశాలస్య శిలాచక్రస్య - పాషాణఫలకస్య, సమ్పాతేన - విక్షేపేణ,

ష్ట్వా తేన సంచూర్ణయన్ విద్విషస్సారథితురగసనాథం రథం, తత ఉత్ప్లుత్య జవాదవక్రాన్తే తస్మిన్నికుమ్భిలాముపజగ్ముషి నిరాశః ప్రతినివృత్య వృత్తాన్తమముం రామం కులిశశతమివ యుగపదవనీధరమతికృచ్ఛ్రీ గమయామాస ॥ ౧౫౬ ॥ వ ॥ ప్రాగభుజ్యతతద్దుః

---

విద్విషః - శత్రోరిన్ద్రజితః, సారథితురగసనాథమ్ - సూతాశ్వసహితమ్, రథం సంచూర్ణయన్ - చూర్ణీకుర్వన్, ॥ వ్యా ॥ చూర్ణశబ్దాత్తత్కరోతీతిణ్యన్తాల్లటశ్శత్రాదేశః. తతః - రథాత్, జవాత్ - వేగాత్, ఉత్ప్లుత్య, అవక్రాన్తే - నిర్గతే, తస్మిన్ - ఇన్ద్రజితి, నికుమ్భిలాం ఉపజగ్ముషి - ప్రాప్తేసతి, గమేర్లిటి. ॥ సూ ॥ క్వసుశ్చేతి క్వసురాదేశః. యద్యప్యత్ర భూతే లిట్ తస్య క్వసుశ్చ ఛన్దస్యేవ, తథాపి బహుశో లోకేపి సాధుత్వమవగన్తవ్యమ్. తథా చోక్తం శ్రీమతా కాళిదాసేన — "శ్రేయాంసి సర్వాణ్యధిజగ్ముషస్తే" ఇతి. నిరాశః - ఆశారహితస్సన్, నిశాచరనిగ్రహనిదానమేవ వినష్టమితఃకిం కార్యమితిభావః. ప్రతినివృత్య, అముం వృత్తాన్తమ్ - సీతావినాశరూపమ్, రామం అతికృచ్ఛ్రీ - తస్య వక్తుమపి దుస్సహత్వాదితిభావః. గమయామాస - ప్రాపయామాస, ॥ వ్యా ॥ గమేర్ణిజన్తాల్లిట్. తస్మిన్నుపమానమాహ — కులిశశతమితి ॥ అవనీధరమ్ - శైలమ్, యుగపత్ - ఏకదా, కులిశానామ్ - వజ్రాయుధానామ్, శతమ్ - అనేకమివ, గమయామాసేతి పూర్వేణాన్వయః. అత్ర శతశబ్దోఽనేకోపలక్షణమ్. యుగపదనేకదమ్భోళిపాతేన మహీధరో యథా విశీర్యేత తథా తద్వార్తాశ్రవణేన రామో వికలేన్ద్రియగ్రామో బభూవేత్యర్థః ॥ ౧౫౬ ॥

ప్రాగితి ॥ తత్ - మారుతిప్రతిపాదితసీతావినాశవృత్తాన్తజన్యం దుఃఖమ్, ప్రాక్ - ప్రథమమ్, సైన్యైః - కపిసేనాభిః, అభుజ్యత - అన్వభూయత ॥ వ్యా ॥ భుజోఽకర్మణిలజ్. తత్రోపమానమాహ -

ఖం ప్రైస్వైర్దుఃఖప్రాహుణికైరివ । యతో వార్తా చ మూర్ఛా చ రాఘ
వం జగ్మతుస్సహ ॥ ౧౫౭ ॥ ౮ ॥ తతః ప్రబుద్ధో దాశరథిరీదృ
శతాదృశతాగోచరస్య శోకసాగరస్య తరణాయ జీవితమేవాతరం

---

ప్రాహుణికైః - అతిథిభిరివేతి ॥ ని ॥ అతిథిప్రాయత్వాత్ప్రాహుణిక ఇత్య
మరః. యథా యత్కిఞ్చిత్సమర్పితం భోజ్యాది ప్రథమమతిథయో
భుఞ్జతే తద్వదితి భావః. అథ తద్దుఃఖస్వభావమేవాహ —యత ఇతి ॥
యతః - దుఃఖాత్, పఞ్చమ్యాస్తసిః. రాఘవం వార్తా - వృత్తాన్తః,
మూర్ఛా - మోహశ్చ, సహ - యుగపదేవ, జగ్మతుః - ప్రాప
తుః. వార్తాశ్రవణసమకాలమేవ శోత్రితుర్మూర్ఛావహం తద్దుఃఖమి
త్యర్థః. యద్వా, యతః - యస్మాత్కారణాత్, రాఘవమ్ - తద్దుః
ఖస్య ప్రథమానుభోక్తారమిత్యర్థః, వార్తా చ మూర్ఛా చ సహం జ
గ్మతుః; తస్మాత్ - వార్తాశ్రవణక్షణ ఏవ శ్రీరామచన్ద్రస్య మూర్ఛ
నాద్ధేతోః, స్వైస్వైర్దుఃఖప్రాఘుణికైర్భుజ్యతేత్యర్థః. మూర్ఛితస్య రామస్య
తద్దుఃఖానుభవానవకాశాదితి భావః. నహి మూర్ఛైవ దుఃఖానుభవ
రూపేతి వాచ్యమ్. వినష్టప్రజ్ఞతా హి మూర్ఛా, అతస్తస్యాం మాన
సేన్ద్రియప్రవృత్త్యభావాత్ తత్ప్రవృత్తేరేవ ఇదం సుఖమిదం దుః
ఖమితి జ్ఞానస్య కారణత్వాచ్చ న దుఃఖహేతుత్వాకారః. అత్ర వా
ర్తామూర్ఛయోర్హేతుకార్యయోస్సహోత్యవర్ణనాదక్రమాతిశయోక్తిః.
తల్లక్షణం తూక్తమ్ ॥ ౧౫౭ ॥

తత ఇతి ॥ తతః, ప్రబుద్ధః - ప్రత్యాగతచేతనః, దాశరథిః, ఇ
దమివ పశ్యతీతీదృశః, సఇవ పశ్యతీతి తాదృశః, ఉభయత్రాపి ॥ సూ॥
త్యదాదిషు దృశోఽనాలోచనే కఞ్ చేతి కఞ్. ఏకత్ర ఇదం కిమోరీ
శ్కీతీదం శబ్దస్య ఈశాదేశః. అన్యత్ర ॥ సూ ॥ ఆ సర్వనామ్న ఇ
త్యాత్వమ్. ఈదృశశ్చ తాదృశశ్చేతి ద్వన్ద్వః తయోర్భావస్తత్తా,
తస్య అగోచరస్య - అవిషయస్య, ఇత్థం తథేతి వివేక్తుమశక్యస్యేత్య

నిశ్చిన్వానో దీనదీనమిదమవాదీత్ ॥ ౧౫౪ ॥ ప ॥ త్వం యాహి వత్స భరతం న విముఞ్చ దూనం త్వం గచ్ఛ మిత్ర కపిభిస్సహ ఋశ్యమూకమ్ । త్వం కుత్ర యాస్యసి విభీషణ వన్ధ్యవాచం క్రూరం విహాయ

---

ర్థః. శోకసాగరస్య - దుఃఖసముద్రస్య, తరణాయ - లఙ్ఘనాయ, జీవితమేవ ఆతరమ్ - తరపణ్యమ్, ॥ ని ॥ ఆతరస్తరపణ్యం స్యాదిత్యమరః. అత్ర జీవితే ఆరోప్యమాణస్య ఆతరస్య స్వతశ్శోకసాగరసముత్తరణోపయోగిత్వాసమ్భవేన ప్రకృతజీవితాత్మనా పరిణత్యపేక్షణాత్పరిణామాలఙ్కారః. నిశ్చిన్వానః - నిశ్చయేన మన్వానస్సన్, ॥ వ్యా ॥ చిఞ్ధాతోస్స్వాదికాత్కర్తరి లటశ్శానచ్. సీతావినాశజన్యదుఃఖనివృత్తయే ప్రాణత్యాగ ఏవోపాయ ఇతి మన్వాన ఇత్యర్థః. దీనదీనమ్ - దీనప్రకారమిత్యర్థః. ॥ సూ ॥ ప్రకారేగుణవచనస్యేతి ద్విర్భావః; కర్మధారయవదుత్తరపదేష్వితి కర్మధారయవద్భావాత్సులోపః. ఇదమ్ - వక్ష్యమాణమ్, అవాదీత్ ॥ ౧౫౪ ॥

శ్రీరామస్తత్రైవాత్మనో వినాశం నిశ్చిన్వన్ లక్ష్మణాదీన్ యదాహ తదేవ వివృణోతి — త్వమితి ॥ హే వత్స - లక్ష్మణ, అతివాత్సల్యాద్వత్సేతి సమ్బోధనమ్. త్వం యాహి - గచ్ఛ. అయోధ్యామితి శేషః. దూనమ్ - అస్మద్విరహోద్దుఃఖితమ్, భరతం న విముఞ్చ - మా త్యజ, ప్రథమమేవ మద్విరహదుఃఖితః త్వయాపి పరిత్యక్తశ్చేద్వినశ్యేదేవేతి భావః. హే మిత్ర - సుగ్రీవ, తస్య సమసుఖదుఃఖత్వాత్ మిత్రేతి సమ్బోధనమ్; కపిభిస్సహ, ఋశ్యమూకమ్ - గిరిమ్, గచ్ఛ - ప్రాప్నుహి. భవతో మదీయదుఃఖసమభాగిత్వేపి మదనుజ్ఞయైవ గమనే న కృతఘ్నతేతి భావః. హే విభీషణ, త్వం కుత్ర యాస్యసి - హితవచనవిముఖేన భ్రాత్రాపి తిరస్కృతో మయాపి విఫలీకృతమనోరథః క్వ గమిష్యసి? వన్ధ్యా - నిష్ఫలా, వాక్ - "దత్తం మయా తే దశకణ్ఠరాజ్యమ్" ఇత్యాదివచనమ్, యస్య

గతిమేవ భజ త్రిజటే ॥ ౧౫౯ ॥ హా జానకి త్వమసి పూర్వమర
ణ్యమార్గే పాతేన పుష్పరజసామపి పాటలాఙ్గీ । సా త్వం కథం కథయ
దారుణదుర్విపాకం ప్రాప్తా లతేవ లవలీ బత వజ్రఘాతమ్ ॥ ౧౬౦ ॥

---

తథోక్తమ్. అనుపదమేవ జీవితత్యాగే కుతస్తద్వచనసఫలీకరణమితి భావః. క్రూరమ్ - నృశంసమ్, శరణాగతపరిత్యాగాదితి భావః. యద్వా, సత్యవాచం మామ్ క్రూరం తన భ్రాతరం చేత్యర్థః. విహాయ, పునస్తమపసర్పణే నిఖిలనిశాచరవినాశనిదానం త్వాం హన్యాదేవేతి భావః. త్రిజటే - త్రిజటానామ్న్యో రాజ్ఞః, గతిమేవ భజ - ప్రాప్నుహి, ఉభయావలమ్బననాశాత్త్రిజటే గతిరేవ సిద్ధేతి భావః. ॥ ౧౫౯ ॥

హేతి ॥ హే జానకి - జనకపుత్రి, హా - కష్టమ్, త్వం పూర్వమ్ - దణ్డకారణ్యప్రవేశకాల ఇత్యర్థః. అరణ్యమార్గే పుష్పరజసామ్ - కుసుమపరాగాణామపి, అపిశబ్దేన అతిసుకుమారాణామితి గమ్యతే. పాతేన పాటలమ్ - శ్వేతరక్తమ్, అఙ్గమ్ - శరీరమ్, యస్యాస్సా పాటలాఙ్గీ. ॥ వ్యా ॥ అఙ్గగాత్రకణ్ఠేభ్యో వక్తవ్యమితి జీష్. జాతేతి శేషః. కుసుమపరాగసంసర్గేణాపి అరుణగాత్రీ అభూరిత్యర్థః. అనేన తస్యాస్సౌకుమార్యాతిశయో వ్యజ్యతే. సా - తాదృశీ, త్వం దారుణమ్ - ఘోరమ్, దుర్విపాకమ్ - కరాళకరవాళకర్తనరూపమ్, లవలీ - మృదులతావిశేషః, వజ్రఘాతమ్ - ఇన్ద్రాయుధప్రహారమివ, కథం ప్రాప్తాసి? కథయ, బతేతి ఖేదే. అత్రోభయతస్త్వంకారప్రయోగోఽవస్థాభేదేన తస్యాః భేదవచనాభిప్రాయగర్భ ఇతి సూక్ష్మమతిభిరూహనీయమ్. అత్ర తదీయాఙ్గసౌకుమార్యస్మరణప్రతీయమానస్య శృఙ్గారరసస్య కరుణరసాఙ్గత్వాద్రసవదలఙ్కారః ॥ ౧౬౦ ॥

॥ ౫ ॥ ఇత్యాదిరీత్యా విలపన్తమేనం సరభసముపేత్య నక్తఞ్చర మాయాప్రభావవిద్రావణానుజః స్వామిన్నస్థానే కోఽయం తవాపి వ్యామోహః ప్రాతిహారికేణ తేన దురాత్మనా నిష్ప్రత్యూహక్రియాలాభాయ ప్రదర్శితో మాయాప్రపఞ్చః ఖల్వయం యదిపునస్సాఙ్గం నిర్వర్త్య నికుమ్భిళాయాం క్రియామిమాముత్సహేత యో

---

ఇతీతి ॥ ఇత్యాదిరీత్యా - ఏవమాదిప్రకారేణ, విలపన్తమ్ - విలప్య రుదన్తమిత్యర్థః. ఏనమ్ - రామమ్, నక్తఞ్చరాణాం మాయా - మోహనకలా, తస్యాః ప్రభావమ్ - వైభవమ్, వేత్తీతి తద్విత్, తస్య నిశాచరపాజాత్యాదితి భావః. ॥ వ్యా ॥ సత్సూద్విషేత్యాదినా క్విప్. రావణానుజః - విభీషణః, సరభసమ్ - త్వరితమ్, ఉపేత్య, స్వామిన్ ॥ వ్యా ॥ స్వామిన్నైశ్వర్య ఇతి స్వశబ్దాన్మత్వర్థీయ ఆమినచ్. అస్థానే - అవిషయే, తవాపి, సర్వజ్ఞస్యాపీత్యర్థః. కోఽయం వ్యామోహః - చిత్తవైకల్యమ్, మోహావిషయేపి మోహస్తవానుచిత ఇత్యర్థః. మోహావిషయత్వమేవ ప్రపఞ్చయతి—ప్రాతిహారికేణేతి ॥ అయమ్ - సీతావినాశరూపః, ప్రాతిహారికేణ - మాయావినా ॥ ని ॥ స్యాన్మాయా శామ్బరీ మాయాకారస్తు ప్రాతిహారిక ఇత్యమరః. దురాత్మనా - దుష్టేన, తేన - రావణినా, నిష్ప్రత్యూహమ్ - నిర్విఘ్నం యథాతథా, ॥ సూ ॥ ఇదుదుపధస్యచాప్రత్యయస్యేతిషత్వమ్. క్రియాయాః - నికుమ్భిళాయాం శత్రుమారణయాగకార్యస్య, లాభాయ - సిద్ధయే, ప్రదర్శితః - ప్రకాశితః, మాయాప్రపఞ్చః ఖలు. నికుమ్భిళాయాం ఇమాంక్రియామ్ - యాగరూపామ్, సాఙ్గం యథాతథా, నిర్వర్త్య - సమాప్య, పునః యోద్ధుం సముత్సహేత యది - ప్రయతేతచేత్, తదా నిగృహీతుమ్ - జేతుమ్, కేన శక్యేత, న కేనాపీత్యర్థః. ॥ సూ ॥ శకధృషేత్యాదినా తుమున్; హేతుహేతుమతోర్లిఙితి ఉభయత్రాపి లిఙ్. తత్ - తస్మా

ద్ధుం తదా తేన శక్యేత నిగృహీతుం తదలం వ్యర్థవిషాదైరద్యైవ వి ర్యాతు విజయమఙ్గళాయ సౌమిత్రిరితి నిర్వ్యళీకమభిధాయ స్వవచ సి చిత్రీయమాణేన రఘుపతినా పరమాశిషః ప్రయుజ్య ప్రస్థాపితమ ధిరూఢహనూమన్తమతికాయహన్తారం పురోధాయ సైన్యైస్సహ నికుమ్భిళాద్వారముపరురోధ ॥ ౧౭౧ ॥ వ ॥ వస్తృణికాకణికైః క

కారణాత్ , వ్యర్థవిషాదైః అలమ్ - నిరర్థకవ్యసనైః ప్రయోజనం నా స్తీత్యర్థః. గమ్యమానక్రియాయా అపి కారకవిభక్తౌ ప్రయోజక త్వాత్కరణే తృతీయా. విజయమఙ్గళాయ - శత్రువిజయరూపమ ఙ్గళార్థమ్, తాదర్థ్యే చతుర్థీ. సౌమిత్రిః - లక్ష్మణః, నిర్యాతు - ని ర్గచ్ఛతు, ఇతి. నిర్గతం వ్యళీకం అప్రియం యస్మిన్కర్మణి తద్యథాత థా, హితమితియావత్. ॥ వి ॥ వ్యళీకం దుఃఖవైలక్ష్యాప్రియకా ర్యేష్వపీతిమేదినీ. అభిధాయ - ఉక్త్వా, స్వవచసి చిత్రీయమాణేన- విస్మయమానేన, ॥ వ్యా ॥ నమోవరివశ్చిత్రఙః క్యజితి చిత్రఙ్ శబ్దా త్క్యచ్, తతశ్శానచ్. రఘుపతినా, పరమాశిషః - చిరఞ్జీవ శత్రుంజ హీత్యాది ఆశీర్వచనాని, ప్రయుజ్య, ప్రస్థాపితమ్ - ప్రేషితమ్, అధిరూఢః - ఆరూఢః, హనూమాన్ యేన తంతథోక్తమ్. అతికాయ స్య - అసురస్య, హన్తారమ్ - లక్ష్మణమ్, పురోధాయ - పురస్కృ త్య, సైన్యైస్సహ - నికుమ్భిళాయాః ద్వారమ్, ఉపరురోధ - రుద్ధవాన్. ॥ ౧౭౧ ॥

వస్తృణికేతి ॥ అథ - నిరోధానన్తరమ్, స్తృణికాః - లాలాః, ॥ ని ॥ స్తృణికాస్యన్దనీలాలేత్యమరః. తాసాం కణికాః - లవాః, తాభిస్సహవర్తమానైః, లాలావిశిష్టైరిత్యర్థః. కపీనాం ఫూత్కృ తైః - ఫూత్కారైః, అభిహతః - నిర్వాపితః, వితానస్య క్రతోః, ॥ వి ॥ క్రతువిస్తారయోరస్త్రీ వితానమిత్యమరః. హుతాశనః - అ గ్నిః, భయాత్ ద్రుతమ్ - శీఘ్రమ్, వేదికామ్ - యజ్ఞవేదికామ్,

పిఘాతకృత్రైరభిహతోఽథ వితానహుతాశనః । ద్రుతముపాస్య భయాదివ వేదికాం మఖిమనఃప్రవివేశ రుషశ్ఛలాత్ ॥ ౧౬౨ ॥ గ ॥

అథ భగ్నమనోరథతయా రుషా జాజ్వల్యమానస్స యజ్వాపశదః స్వాహాకారవిరసయా రసనయా హాహాకారమూరీకుర్వాణః స్రస్త

---

అపాస్య - త్యక్త్వా, రుషః - కోపస్య, ఛలాత్ - వ్యాజాత్, మఖినః - యజమానస్య, రావణేర్మనఃప్రవివేశ - ప్రవిష్టఇవ, కపిభిర్నిహతనిజమనోరథో రావణిర్భృశం కోపేన జజ్వాలేత్యర్థః. అత్ర కపిఘాతకృత నిర్వాపితస్య యజ్ఞహుతాశనస్య యజమానమనఃప్రవేశ సమ్భావనయా స్వరూపోత్ప్రేక్షా. సా చ రుషః ఛలాదిత్యపహ్నవోత్థాపితేతి తయోస్సఙ్కరః. ॥ ౧౬౨ ॥

అథేతి ॥ అథ భగ్నః - నష్టః, మనోరథః - నికుమ్భిలాయాగాభిలాషః, యస్య తథోక్తః తస్య భావస్తత్తా. తయా హేతునా, హేతౌ తృతీయా, రుషా కరణేన, తథా చ మనోరథభఙ్గహేతుకక్రోధేన కరణేనేత్యర్థః. జాజ్వల్యమానః - ముహుర్ముహురుజ్జ్వలన్, జ్వలదీప్తౌ యఙన్తాత్కర్తరి లటశ్శానచ్. యజ్వా చాసౌ అపశదశ్చేతి కర్మధారయః; కుత్సితాని కుత్సనైరితిసమాసః. స ఇన్ద్రజయీ, స్వాహా - దేవహవిర్దానమ్, ॥ ని ॥ స్వాహాదేవహవిర్దానమిత్యమరః, స్వాహాకారః - తస్యకరణమితిస్వాహాశబ్దోచ్చారణమిత్యర్థః. ॥ వ్యా ॥ భావేఘఞ్. తేనవిరసయా - ద్రవరహితయా, రసనయా - జిహ్వయా, హాహాకారమ్ - హాహాఇత్యాకారకశబ్దోచ్చారణమ్, హేతివిషాదే, తస్యైవద్విర్భావః. ॥ ని ॥ హావిషాదశుగార్తిష్విత్యమరః. శేషం పూర్వవత్; ఊరీకుర్వాణః - అఙ్గీకుర్వన్, ॥ ని ॥ ఊరీకృతమఙ్గీకృతమిత్యమరః. స్రస్తః - గళితః, స్రువః - యజ్ఞసాధనవిశేషః, యస్మాత్తేన తథోక్తేన పాణినా - కరేణ, శరాసనమ్ - చాపమ్, ఆదాయ - గృహీత్వా, మనోరథమివ

ప్రవేణ పాణినా శరాసనమాదాయ మనోరథమివ శిథిలమధిరు
హ్య పురాతనమేవ రథం హవముత్సృజ్య దాశథినాఽఽహవమేవ క
ర్తుమారేభే ॥ ౧౬౩ ॥ ప ॥ అథ రాఘవమేఘనాదయోర్ధనుషీ తా
రతరం చుకూజతుః । భయభగ్నశిరోధరైరిభైస్సహ సంచుక్షుభిరే
దిశస్తదా ॥ ౧౬౪ ॥ విఫలీకృతవజ్రశక్తిభిస్సతతస్యన్దిశచీదృగశ్రుభిః ।

---

శిథిలమ్ - శీర్ణావయవమ్, మారుతినా కపటజానకీకణ్ఠచ్ఛేదనకాలప్రవ చూర్ణితత్వాదితి భావః. పురాతనమ్ - పూర్వారూఢమిత్యర్థః. రథం అధిరుహ్య, హవమ్ - యజ్ఞమ్ ॥ ని ॥ హవ ఆజ్ఞాధ్వరాహ్వానేష్వితి మేదినీ. ఉత్సృజ్య - విహాయ, దాశరథినా - లక్ష్మణేనసహేత్యర్థః. ఆహవమ్ - యుద్ధమేవ, ॥ ని ॥ అభ్యామర్దసమాఘాతసఙ్గ్రామాభ్యాగమాహవాఇత్యమరః. కర్తుమ్ - విధాతుమ్, ఆరేభే - ఆరబ్ధవాన్. ॥

అథేతి ॥ అథ - ఇన్ద్రజితస్సమరసన్నాహానన్తరమ్, రాఘవమేఘనాదయోః - లక్ష్మణేన్ద్రజితోః, ధనుషీ తారతరమ్ - అత్యుచ్చైరిత్యర్థః. చుకూజతుః - దధ్వనుః, ॥ వ్యా ॥ కూజఅవ్యక్తేశబ్దే లిట్. తదా - తత్కాలే, దిశః భయేన భుగ్నః - అవనతః, శిరోధరః - కణ్ఠః, యేషాం తాదృశైః, ఇభైః - గజైస్సహ ॥ ని ॥ ఇభస్తమ్బేరమఃపద్మీత్యమరః. సఞ్చుక్షుభిరే - క్షోభంప్రాపుః. లక్ష్మణేన్ద్రజితోః ధనుర్ధ్వనినా దిగ్గజాదిశశ్చ చకమ్పిరే ఇత్యర్థః. దిశః ఇభైస్సహ సఞ్చుక్షుభిరే ఇతి సహభావవర్ణనాత్సహోక్తిరలఙ్కారః. సచ ధనుర్విస్ఫారేణ తయోః క్షోభాసమ్బన్ధేఽపి తత్సమ్బన్ధవర్ణనాత్సమ్బన్ధాతిశయోక్త్యా సంసృజ్యతే ॥ ౧౬౪ ॥

విఫలీకృతేతి ॥ పటుః - రణచతురః, ఇన్ద్రజిత్, విఫలీకృతా - మోఘీకృతా ॥ వ్యా ॥ అభూతతద్భావే చ్విః. వజ్రస్య - దమ్భోలేః, శక్తిః యైస్తథోక్తైః. సతతం స్యన్దన్త ఇతి సతతస్యన్దీని, తాచ్ఛీల్యే ణినిః. శచ్యాః - ఇన్ద్రాణ్యాః, దృగశ్రూణి యేభ్యస్తాదృశైః,

పిదధే పటురూర్మిళాసఖం స్యదసాత్కారిగరుద్భిరాశుగైః ॥౧౬౫॥
చలితా జగతీన్ద్రనన్దనాత్సుమనశ్శ్లాఘ్యతమాచ్ఛిలీముఖాః । యయు

---

నిరన్తరసముత్పాదితశచీశోకబాష్పైరిత్యర్థః. పురన్దరపీడాజనకత్వాదితిభావః. స్యదేన - రంహసా, ॥ ని ॥ రంహస్తరసీ తురయః స్యదఇత్యమరః. సాం కరోతీతి స్యదసాత్కారీ - సామితిశబ్దం కుర్వన్నిత్యర్థః. గరుత్ - పక్షః, యేషాం తైస్తాదృశైః. ఆశుగైః - విశిఖైః, ॥ ని ॥ ఆశుగౌ వాయువిశిఖావిత్యమరః. ఊర్మిళా - జనకరాజపుత్రీ, తస్యాస్సఖా తత్సఖః ॥ వ్యా ॥ సమాసాన్తష్టచ్. తమ్ - ఊర్మిళాసహచరం లక్ష్మణమిత్యర్థః. పిదధే - ఆచ్ఛాదయామాస ; బాణైర్జఘానేత్యర్థః. అపీత్యుపసర్గపూర్వాద్ధాఞ్ ధాతోర్లిట్. ॥ శ్లో ॥ "వష్టి భాగురిరల్లోపమవాప్యోరుపసర్గయోః" ఇతి వచనాదకారలోపః. ఏతదేవ ప్రపఞ్చితమమరసింహేన "అపిధానతిరోధానపిధానాచ్ఛాదనానిచ" ఇతి. ॥ ౧౬౫ ॥

చలితా ఇతి ॥ సుమనోభిః - దేవైః, ధీరైర్వా కర్తృభిః, శ్లాఘ్యతమాత్ - అతిశయేన శ్లాఘనీయాత్, వీరాగ్రేసరోయమితి స్తూయమానాదిత్యర్థః. అన్యత్ర సర్వర్తునిర్వృతికరత్వాదితిభావః. యద్వా, సుమనోభిః - కుసుమైర్హేతుభిః, శ్లాఘ్యతమాత్, ॥ ని ॥ సుమనాఃపుష్పమాలత్యోః స్త్రియాం నా దేవధీరయోరిత్యమరశేషః. జగతీన్ద్రః - దశరథః, తస్య నన్దనాత్ - సుతాల్లక్ష్మణాత్, అన్యత్ర జగతీనామ్ - లోకానాం త్రయాణామ్, ఇన్ద్రస్య - ఈశ్వరస్య శతక్రతోః, నన్దనాత్ - నన్దనవనాత్, ॥ ని ॥ నన్దనం వాసవోద్యానే సుతే నా హర్షకే త్రిష్వితి నానా. ॥ సూ ॥ ధ్రువమపాయేఽపాదానమిత్యపాదానత్వమ్. చలితాః - నిర్గతాః, శిలీముఖాః - బాణాః, భ్రమరాశ్చ, ॥ ని ॥ అలిబాణౌ శిలీముఖావిత్యమరః. ఆశు - శీఘ్రమ్, అనయతి జీవయతీత్యానకః, అనప్రాణనఇతి ధాతోఃకర్తరి

రాశుపలాశకాననం లఘుతాత్యక్తగుణైర్నగణ్యతే ॥ ౧౬౬ ॥ పు
త్రాదినీం పాపవిశేషభీషణాం వైయాఘ్రజాతిం వహతస్తవోచితా ।

ల్యః. పలాశకానాం అననమ్ - నిశాచరకులజీవాతుమ్, మేఘనాదమిత్యర్థః. అథవా, పలం మాంసం అశ్నన్తి - ఖాదన్తీతి పలాశాః, కాననమివ తత్, అరణ్యవదతినిబిడాః రాక్షసా ఇత్యర్థః. అన్యత్ర పలాశానామ్ - కింశుకానామ్, కాననమ్ ॥ ని ॥ పత్రే పలాశం హరితే రాక్షసే కింశుకే పుమానితి నానా. యయుః - ప్రాపుః. ఉభయత్రాప్యౌచిత్యముపపాదయన్నర్థాన్తరం న్యస్యతి. త్యక్తః - ఉత్సృష్టః, గుణః - సత్త్వాదిః మౌర్వీ చ, ॥ ని ॥ మౌర్వ్యాం ద్రవ్యాశ్రితే సత్త్వే శుక్లసన్ధ్యాదికే గుణ ఇతి నానార్థేష్వమరః. తైస్తథోక్తైః, సద్గుణరహితైరిత్యర్థః. అన్యత్ర జ్యానిర్గతైరిత్యర్థః. లఘుతా - లాఘవమ్, నగణ్యతే - నలక్ష్యతే, అత ఏవ త్యక్తగుణానామమీషామపి పలాశకాననప్రాప్తిరుచితైవేతి భావః. అత్ర ఏకేనైవ శబ్దేన అర్థద్వయప్రతీతేరర్థశ్లేషః; ప్రకృతాప్రకృతవిషయః, తదుత్థాపితశ్చ. లఘుతాత్యక్తగుణైర్నగణ్యతే ఇతి సామాన్యేన విశేషసమర్థనరూపోఽర్థాన్తరన్యాస ఇతి తయోస్సఙ్కరః ॥ ౧౬౬ ॥

తదను విభీషణం ప్రతి ఇన్ద్రజితశ్శక్తిప్రహారమాహ — పుత్రాదినీమితి ॥ అథ - అనన్తరమ్, సః - ఇన్ద్రజిత్, పాపమస్యాస్తీతి పాపః. ॥ వా ॥ అర్శఆదిభ్యోఽచ్ ప్రత్యయః. హే పాప - పాతకిన్ విభీషణ, పుత్రమత్తి తాచ్ఛీల్యేనేతి పుత్రాదినీ, తథాభూతాం సుతఘాతినీమిత్యర్థః. అతఏవ విశేషేణ భీషణామ్ - భయజననీమ్, వ్యాఘ్రీణామియం వైయాఘ్రీ, ॥ వా ॥ తస్యేదమిత్యణ్. ॥ సూ ॥ నయ్వాభ్యాం పదాన్తాభ్యాం పూర్వౌ తు తాభ్యామైచ్ ఇతి వృద్ధిప్రతిషేధ ఐజాదేశశ్చ. తాదృశీ చ సా జాతిశ్చ వైయాఘ్రజాతిః. ॥ వా ॥ స్త్రియాః పుంవదిత్యాదినా పుంవద్భా

విభీషణాఖ్యేతి పితృవ్యముద్దిశన్ రౌద్రాకృతింశక్తిమథోత్ససర్జసః ॥
శిఖామణిస్సంశ్రితవత్సలానాం సలక్ష్మణస్తీక్ష్ణశిఖైః పృషత్కైః । చి
చ్ఛేదతామేవ పరంనశక్తిముత్సాహశక్తించ పరామరాతేః ॥ ౧౬౮ ॥

---

వః. వ్యాఘ్రసామాన్యధర్మః, ॥ సి ॥ జాతిర్జాతంచ సామాన్యమిత్యమరః. వ్యాఘ్రాస్స్వసుతాన్ స్వయమేవ ఖాదన్తీతి ప్రసిద్ధిః. తాం వహతః - భజతః, తవవిశేషేణభీషయతీతి విభీషణః ॥ వ్యా ॥ నన్ద్యాదిత్వాల్ల్యుః. తథేత్యాఖ్యా - అభిధానమ్, ఉచితా - యుక్తా, పుత్రస్యాపి మమవధే విహితోద్యోగస్య భవతో విశేషేణభీషయతీతి వ్యుత్పత్త్యా విభీషణ ఇతి నామధేయముచితమితిభావః; ఇతి - ఇత్యుక్త్వేత్యర్థః. పితృవ్యమ్ - పితృభ్రాతరమ్, విభీషణమ్, ॥ ని ॥ పితృభ్రాతా పితృవ్యస్స్యాదిత్యమరః; పితృవ్యమాతులమాతామహపితామహా ఇతి నిపాతనాత్సాధుః. ఉద్దిశన్ - లక్ష్యీకుర్వన్, రౌద్రాకృతిమ్ - ఉగ్రాకారామ్, శక్తిమ్ - శక్త్యాయుధమ్, ఉత్ససర్జ - ఉత్సృష్టవాన్, ప్రేరయామాసేత్యర్థః. అత్ర విభీషణఇత్యాఖ్యాయా యోగతః అర్థాన్తరకల్పనయా నిరుక్తిరలఙ్కారః. తదుక్తమ్ " నిరుక్తిర్యోగతో నామ్నామపరార్థప్రకల్పనమ్ " ఇతి. ॥ ౧౬౭ ॥

శిఖామణిరితి ॥ సంశ్రితేషు - ఆశ్రితేషు, వత్సలానామ్ - ప్రీతిమతామ్, ॥ సూ ॥ వత్సాంసాభ్యాఙ్కామబలఇతి కామవదర్థే మత్వర్థీయోలచ్. శిఖామణిః - చూడారత్నమ్, శ్రేష్ఠఇత్యర్థః. సలక్ష్మణః, తీక్ష్ణశిఖైః - నిశితాగ్రైః, పృషత్కైః - బాణైః, ॥ ని ॥ పృషత్కబాణవిశిఖాఇత్యమరః. అరాతేః - శత్రోరిన్ద్రజితః, తామేవ - పూర్వోక్తామేవ, శక్తింపరమ్ - శక్త్యాయుధం కేవలమ్, నచిచ్ఛేద; కింతు పరామ్ - ఉత్కృష్టామ్, ఉత్సాహశక్తించ చిచ్ఛేద. శత్రుసమాపనప్రహితస్య శక్త్యాయుధస్య ఛేదనాత్ ఇన్ద్రజిదుత్సాహశక్తిశూన్యోబభూవేత్యర్థః. శక్తిత్రయేహ్యన్యతమా

॥ గ ॥ అథ ప్రతిదన్తిభగ్నదన్తైరావణో రావణిరమర్షప్రకర్షేణ రథనిర్విశేషం రఘూద్వహం తముద్వహన్తమక్షహన్తారమహన్తారచితవల్గువల్గనమసుహృజ్జనహృజ్జనితాఽతిలోహితలోహితపానైకకృతవ్యవసాయైస్సాయకైర్ముహుర్ముహురాజఘాన రాజఘానామగ్ర

---

అత్యధికవిక్రమచేష్టాజన్యా ఉత్సాహశక్తిరిత్యుచ్యతే ॥ ని ॥ షడ్గుణాశ్శక్తయస్తిస్రః ప్రభావోత్సాహమన్త్రజా ఇత్యమరశ్చ ॥ ౧౬౮ ॥

అథేతి ॥ అథ - శక్తిచ్ఛేదనానన్తరమ్, ప్రతిదన్తీ - ప్రతికూలద్విరదః, తేన భగ్నదన్తః - త్రుటితరదనః, ఐరావణః - ఐరావతగజస్థితః, సమరైకసాధనశక్త్యాయుధభఙ్గాదితిభావః. రాజ్ఞో ఘ్నన్తీతి రాజఘాః, ॥ వా ॥ రాజఘ ఉపసఙ్ఖ్యానమితి హన్తేష్టక్ టిలోపో ఘత్వంచ నిపాతనాత్ . తేషాం అగ్రణీః - అగ్రేసరః, క్షత్రియకులహన్తేత్యర్థః. రావణిః - ఇన్ద్రజిత్, అమర్షప్రకర్షేణ - క్రోధాతిశయేన, రఘూద్వహమ్ - లక్ష్మణమ్, రథాత్ నిర్గతో విశేషో యస్మిన్ కర్మణి తద్యథా తథా, ఉద్వహన్తమ్ - స్యన్దనవదనాయాసేన తం స్కన్ధే ఆరోప్య వర్తమానమిత్యర్థః. అహన్తయా - అహమ్భావేన, రచితం వల్గు - చమత్కారకారి, వల్గనమ్ - సఞ్చారః, యేన తం తథోక్తమ్. అక్షహన్తారమ్, సుహృదో న భవన్తీత్యసుహృదః, యద్వా, అసూన్ హరన్తీతి అసుహృతః - శత్రవః, కర్తరి క్విప్ ॥ సూ ॥ హ్రస్వస్య పితి కృతి తుగితి తుగాగమః ॥ ని ॥ అసుహృత్ప్రత్యవస్థాతృప్రతిపక్షవిరోధిన ఇత్యమరః. తాదృశానాం జనానాం హృది - హృదయే, జనితస్య - ఉత్పాదితస్య, అతిలోహితస్య - అత్యన్తారుణస్య, లోహితస్య - క్షతజస్య, ॥ ని ॥ రుధిరేఽసృగ్లోహితాస్రరక్తక్షతజశోణితమిత్యమరః. పానే ఏకః - ముఖ్యః, కృతః వ్యవసాయః - ఉద్యోగః, యైస్తథోక్తైః ॥ సూ ॥ శేషెకవితికప్. సాయకైః - శరైః, ముహుర్ముహుః ఆజఘాన - హతవాన్, హన్తేర్లిట్

ణేః ॥ ౧౬౯ ॥ స ॥ క్రవ్యాద్దుర్వినయాసహిష్ణురనుజస్సీతాపతేః కోపనశ్శౌర్యశ్రీసఫలీకృతానిమిషదృక్సమ్పత్త్రిభిఃపత్త్రిభిః । తస్యై తస్యధనుర్గుణం గుణచణం సూతం వియాతం తథా కేతుం గౌరవహేతుమప్యరితిరస్కర్తా చకర్తాచిరాత్ ॥ ౧౭౦ ॥ గ ॥ అథ నిర్విషీ

---

ణల్ ప్రత్యయే హోహన్తైరితికుత్వమ్ ॥ ౧౬౯ ॥

క్రవ్యాదితి ॥ క్రవ్యమ్ - మాంసమ్, ॥ ని ॥ పిశితం తరసం మాంసం పలలంక్రవ్యమిత్యమరః. తదత్తీతి క్రవ్యాత్ - రాక్షసః, ॥ సూ ॥ క్రవ్యేచేతి విచ్ ప్రత్యయః. తస్య - ఇన్ద్రజితః, దుర్వినయమ్ - దుర్నీతిమ్, హనూమద్ధంసనరూపామ్, అసహిష్ణుః - అసహమానః, ॥ సూ ॥ అలంకృఞ్ ఇత్యాదినా ఇష్ణుచ్ ప్రత్యయః. శౌర్యశ్రియా - విక్రమసమ్పత్త్యా, ॥ ని ॥ శోభాసమ్పత్తిపద్మాసు లక్ష్మీఃశ్రీరితికథ్యతఇతిశబ్దార్ణవే. సఫలీకృతా - సార్థకీకృతా, అనిమిషాణామ్ - దేవానామ్, దేవానామనిమిషదృష్టిసృష్టేర్లక్షణశౌర్యనిరీక్షణమేవ పరమం ప్రయోజనమితిభావః. దృక్సమ్పత్ - దృష్టిసమృద్ధిః, యేనతథోక్తః. అరీణామ్ - శత్రూణామ్, తిరస్కర్తా, సీతాపతేః అనుజః - లక్ష్మణః, కోపనః - రోషాద్ధేతోః, త్రిభిః పత్రిభిః - బాణైః కరణైః, ॥ ని ॥ పత్రీరోపణఇషుర్ద్వయోరిత్యమరః. తస్య - తథాదుష్టస్యేత్యర్థః. ఏతస్య - రావణేః, ధనుర్గుణమ్ - చాపమౌర్వీమ్, గుణైః - కళాభూతకరకౌశలాదిభిః, విత్తః - ప్రసిద్ధః, గుణచణః ॥ సూ ॥ తేనవిత్తశ్చుఞ్చుప్చణపావితి చణప్ప్రత్యయః. వియాతమ్ - ధృష్టమ్, ॥ ని ॥ ధృష్టేధృష్ణుర్వియాతశ్చేత్యమరః. సూతమ్ - సారథిమ్, తథైవ గౌరవహేతుమ్ - మహత్వకారణమ్, కేతుమ్ - ధ్వజమపి, అచిరాత్ - శీఘ్రమ్, చకర్త - చిచ్ఛేద, కృతీచ్ఛేదనేఇతి ధాతోఃకర్తరిలిట్ ॥ ౧౭౦ ॥

అథేతి ॥ అథ, అనిర్విషః నిర్విషః సమ్పద్యమానఃకృతః -

కృతేనేవ విషధరేణ కేవలం వినిశ్వసతా పురుహూతజితా సరోషప్రే
షితాం మన్త్రాస్త్రపరమ్పరాం ప్రత్యస్త్రైర్విఫలయన్నూర్మిళా
జానిరయమేవ సమయః ఖలనిగ్రహస్యేతి నిర్ణీయ తూణీరముఖాదు
ద్దధార కమపి త్రిభువనశివఙ్కరం శరమ్ ॥ ౧౭౧ ॥ వ ॥ సన్ధాయ
త్వరయా తముగ్రధనుషి శ్రద్ధాలురావర్తయన్నైన్ద్రం మన్త్రముధా

---

ఉత్ఖాతవిషదన్త ఇత్యర్థః. తాదృశేన విషధరేణ - సర్పేణేవేత్యుపమా, కేవలం నిశ్వసతా నత్వపరాధినం హింసతేత్యర్థః; సాధనభఙ్గాదితి భావః. పురుహూతజితా - ఇన్ద్రజితా, సరోషంయథాతథా ప్రేషితామ్ - ప్రహితామ్, మన్త్రాస్త్రాణామ్ - మన్త్రప్రయుక్తాస్త్రాణామాగ్నేయాదీనామ్, శాకపార్థివాదిత్వాన్మధ్యమపదలోపీ సమాసః. పరమ్పరామ్, ప్రత్యస్త్రైః - వారుణాదిభిః, విఫలయన్ - వ్యర్థీకుర్వన్, విఫలశబ్దాత్తత్కరోతీతి ణౌ లటశ్శత్రాదేశః. ఊర్మిళా - జనకసుతా, జాయా - భార్యా, యస్య సః ఊర్మిళాజానిః, జాయాయా నిఙ్ ఇతి నిఙాదేశః. ఖలనిగ్రహస్య - పిశునపరిహారస్య, ॥ ని ॥ పిశునో దుర్జనః ఖల ఇత్యమరః, అయమేవ సమయః - కాలః, ఇతి నిర్ణీయ - నిశ్చిత్య, తూణీరస్య - నిషఙ్గస్య, ముఖాత్ త్రయాణాం భువనానాం సమాహారస్త్రిభువనమ్. తస్య శివమ్ - మఙ్గళమ్, కరోతీతి శివఙ్కరః. తమ్ - మఙ్గళకరమ్, లోకకణ్టకపరిహారకత్వాదితి భావః. ॥ ని ॥ క్షేమఙ్కరోఽరిష్టతాతిశ్శివతాతిశ్శివఙ్కరః. కమపి శరమ్ - బాణమైన్ద్రాస్త్రమ్, ఉద్దధార - ఉద్ధృతవాన్, ॥

అథేన్ద్రజితో వధమాహ — సన్ధాయేతి ॥ సుమిత్రాసుతః - లక్ష్మణః, తమ్ - తూణీరముఖోద్ధృతంశరమ్, త్వరయా - వేగేన, ఉగ్రధనుషి - రౌద్రకోదణ్డే, సన్ధాయ, ఐన్ద్రమ్ - ఇన్ద్రదేవతాకమ్, ॥ సూ ॥ సాస్య దేవతేత్యణ్, మన్త్రమ్, శ్రద్ధాలుః - శ్రద్ధయా యుక్తస్సన్, శ్రద్ధా ఆస్తిక్యబుద్ధిః, శ్రదన్తరోరుపసర్గవద్వృత్తి

నుచిన్త్యసకలశ్రేయస్కరం భ్రాతరమ్ । ఆకృష్య శ్రవణావధిమ్రి తమముం ముఞ్చన్ సుమిత్రాసుతశ్శక్రద్రోహిశిరోఽచ్ఛినత్కిమప రం జీవన్మృతో రావణః ॥ ౧౭౨ ॥ పుష్పేషు నన్దనభవేషు భువి చ్యుతేషు దివ్యేషు దున్దుభిషు చ ప్రణదత్సు ధీరమ్ । సర్వైరుపేత్య విజయీ

రిత్యుక్తమ్; శ్రదిత్యవ్యయపూర్వాద్దధాతేర్భావేక్విప్. తతః - ॥ సూ ॥ స్పృహిగృహిపతిదయినిద్రాతన్ద్రాశ్రద్ధాభ్య ఆలుజిత్యా లుచ్ ప్రత్యయః. ॥ ని ॥ శ్రద్ధాళుశ్శ్రద్ధయాయుక్తఇత్యమరః. ఆ వర్తయన్ - ముహుఉరుచ్చరన్, అథ సకలాని శ్రేయాంసి - శత్రువి నాశాదిరూపాణి, కరోతీతి సకలశ్రేయస్కరః ॥ సూ ॥ కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యేష్వితి హేతౌట్టప్రత్యయః. తమ్- అఖిల శ్రేయోనిదానమ్, భ్రాతరమ్ - రామభద్రమ్, అనుచిన్త్య - అను స్మృత్య, తథాచ శ్రీరామాయణే లక్ష్మణవచనమ్ ॥ శ్లో ॥ "ధర్మా త్మాసత్యసన్ధశ్చ రామోదాశరథిర్యది । పౌరుషే చాప్రతిద్వన్ద్వశ్శ రైనం జహి రావణిమ్" ఇతి. శ్రవణావధి - కర్ణపర్యన్తమ్, ఆకృష్య, అముమ్ - శరమ్, ముఞ్చన్ - ప్రయుఞ్జానస్సన్, శక్రద్రోహిణః - ఇన్ద్రశత్రోః, శిరః అచ్ఛినత్ - చిచ్ఛేద, ఛిదిర్ ద్వైధీకరణ ఇతిధాతో రౌధాదికాల్లజ్. కిమపరమ్ - అపరం కిమస్తి కార్యమిత్య ర్థః. కుతఇత్యత్రాహ. రావణః జీవన్ మృతః - నష్టః, ఇన్ద్రజి తో వినాశే రావణో జీవన్నపి మృతప్రాయ ఇత్యర్థః. తస్య తదేక బలత్వాదితి భావః. ॥ ౧౭౨ ॥

పుష్పేష్వితి ॥ నన్దనభవేషు - దేవోద్యానజాతేషు, పు ష్పేషు, భువి - భూమౌ, చ్యుతేషు - పతితేషు సత్సు, దివ్యేషు- నాకభవేషు, దున్దుభిషు, ధీరమ్ - గమ్భీరం యథాతథా, ప్రణద త్సు - ధ్వనత్సు సత్సు, సౌమిత్రివిజయనిరీక్షణజనితానన్దాస్సురా నవర్షుః కుసుమాని వాదయామాసుశ్చ భేరీరిత్యర్థః. విజయః - జయ

క్షతభూషితాఙ్గో లజ్జానతస్సవది సప్రణనామ రామమ్ ॥ ౧౬౩ ॥

॥ గ ॥ తదానీమతితృషిత ఇవ పీయూషహ్రదం నిస్స్వ ఇవచ నిధిం వ శ్యన్మైథిలీజానిరతిమాత్రవాత్సల్యాదేనమఙ్కమారోప్య పరిరభ్య దోర్భ్యామాఘ్రాయచ శిరసి ముహుర్ముహురున్మత్త ఇవానుష్ఠితమేవానుతిష్ఠన్ పరమానన్దనిర్భరోఽపి సాశ్రురిత్థమకథయత్ ॥ ౧౬౪ ॥

---

శీలః, క్షతేన - శస్త్రఘాతలక్షణేన, భూషితమ్ - అలఙ్కృతమ్, అఙ్గమ్ - శరీరమ్, యస్య సతథోక్తః; క్షతమపి సమరవిజయినాం భూషణమితి భావః. తదుక్తమ్ భర్తృహరిణా ॥ "మణిశ్శాణోల్లీఢస్సమరవిజయీ హేతిదళితః" ఇత్యాది. సః - లక్ష్మణః, రామమ్, సర్వైః - విభీషణాదిభిస్సహ, ఉపేత్య - ఆసాద్య, సపది - తత్క్షణమ్, లజ్జానతః, శత్రుశరక్షతం స్వశరీరం రామాయ ప్రదర్శయితుమితి భావః. ప్రణనామ - నమస్కృతవాన్. ॥ ౧౬౩ ॥

తదానీమితి ॥ తదానీమ్ - తస్మిన్కాలే, మైథిలీజానిః - శ్రీరామః, ఏనమ్ - లక్ష్మణమ్, తృషితః - పిపాసితః, గత్యర్థాకర్మకేత్యాదినా కర్తరి క్తః. పీయూషస్య - అమృతస్య, హ్రదం - అగాధజలాశయమివ, ॥ ని ॥ జలాశయో జలాధారస్తత్రాగాధజలే హ్రద ఇత్యమరః. నిస్స్వః - దరిద్రః, ॥ ని ॥ నిస్స్వస్తు దుర్గతో దీనో దరిద్ర ఇత్యమః. నిధిమ్ - అక్షయధనాకరమివ, అతిమాత్రవాత్సల్యాత్ - అత్యన్తప్రీతేః, పశ్యన్ సన్, అఙ్కమ్ - ఉత్సఙ్గమ్, ఆరోప్య - అఙ్కే ఉపవేశ్యేత్యర్థః, దోర్భ్యామ్ - బాహుభ్యామ్, పరిరభ్య - ఆలిఙ్గ్య, శిరసి ఆఘ్రాయచ, ముహుర్ముహుః - శశ్వత్, ఉన్మత్త ఇవ - భ్రాన్తచిత్త ఇవ, అనుష్ఠితమేవానుతిష్ఠన్ - కృతమేవకుర్వన్, పరమానన్దనిర్భరః - అత్యానన్దపరిపూర్ణోఽపి, సాశ్రుః - బాష్పావిలలోచనః, ఆనన్దభరితత్వే సబాష్పత్వం విరుద్ధమ్, అరివిజయవార్తాశ్రవణేనానన్దః, అనుజస్య క్షతశరీరదర్శనేన శోకబాష్పమితి పరిహారః

॥ వ ॥ ప్రాజ్యోదయం తృణమివ త్యజతాపి రాజ్యమేకో మయా నిధిరివాయమలమ్భి వత్సః । తస్యాపి గాత్రమతిదారుణబాణవిద్ధం పశ్యామి వజ్రహృదయః కిమితః పరేణ ॥ ౧౭౫ ॥ గ ॥ అథ లఙ్కాయాం కిఙ్కరముఖాదవగతసుతనిధనవృత్తాన్తో రావణః కులిశదారిత ఇవ భూధరో ధరాయాం నిపత్య చిరాదుత్థాయ విదితశోకరసరుచిః భృశమి

---

ఇత్థమ్ - వక్ష్యమాణవిధయా, అకథయత్ - అవోచత్ ॥ ౧౭౪ ॥

తదుక్తిప్రకారమేవాహ — ప్రాజ్యేతి ॥ ప్రాజ్యః - ప్రచురః, ఉదయః - అభ్యుదయః, యస్య తత్తథోక్తమ్ ॥ ని ॥ ప్రభూతం ప్రచురం ప్రాజ్యమిత్యమరః. నిఖిలభోగావహమిత్యర్థః. రాజ్ఞః భావో రాజ్యమ్, రాజాసే ఇతి యత్, తృణమివ - తద్వదనాదరేణేత్యర్థః త్యజతా - విసృజతా, మయా ఏకోఽయం వత్సః - లక్ష్మణః, నిధిరివ అలమ్భి - ఆశ్రితః, లభధాతోః కర్మణి లుఙ్. తస్యాపి - రాజ్యాదప్యతిప్రీతిభాజనస్య వత్సస్య, శరీరం అతిదారుణబాణవిద్ధమ్ - అతిఘోరశరాహతం సత్, వజ్రమివ హృదయం యస్య తాదృశః - కఠినమానసస్సన్, పశ్యామి. ఇతః - అస్మాత్, పరేణ - అన్యేన, కఠినవిషయదర్శనేన కిం భవతీత్యర్థః. ఏతాదృశస్య వత్సస్య క్షతశరీరనిరీక్షణమాత్రేణైవ విదీర్ణచేతసా మయా భవితవ్యమ్; తథాపి కఠోరచేతాః పశ్యామి, కిమితః పరం దుర్దర్శమితి భావః ॥ ౧౭౫ ॥

అథేతి ॥ అథ, లఙ్కాయామ్, కిఙ్కరముఖాత్, అవగతసుతనిధనవృత్తాన్తః - విదితేన్ద్రజిన్మరణప్రవృత్తిః, రావణః, కులిశదారితః - దమ్భోళిదళితః, భూధరః - శైల ఇవ, ధరాయామ్ - భూమౌ, నిపత్య చిరాదుత్థాయ, విదితః - జ్ఞాతః, శోకరసస్య రుచిః - ఆస్వాదః, యేన తథోక్తస్సన్, భృశమ్ - అత్యన్తమ్, ఇత్థమ్ - వక్ష్యమాణరీత్యా, అరోదీత్ - విలలాప. రుదిర్ అశ్రువిమోచనే ఇతి ధాతోః కర్తరి లుఙ్. ॥ ౧౭౬ ॥

త్థమరోదీత్ ॥ ౧౭౬ ॥ వ ॥ హాహన్తపుత్ర విధిరద్యనిహన్తుకామం
పౌలస్త్యవంశవిశిఖో మనుజాకృతిస్త్వామ్ । నేతుం తవాన్తికభువం
సకథంకృతాన్తో దిక్పాలకుఞ్జరహరే రభజత్సధైర్యమ్ ॥ ౧౭౭ ॥
॥ గ ॥ ఇతి ముక్తకణ్ఠం ప్రరుదన్ దశకణ్ఠస్సుతశోకావేగవిలుప్తవివేకః

---

రావణవిలాపప్రకారం వివృణోతి — హాహన్తేతి ॥ హాహన్త - కష్టమ్, పుత్రస్మరణాదేవ శోకరపాహ్వాదానువాదః; హే పుత్ర! త్వామ్ - పులస్త్యస్యాయం పౌలస్త్యః - పులస్త్యసమ్బన్ధీ, తస్యేదమిత్యణ్ . వంశః - కులమేవ, వంశః - వేణురితి శ్లిష్టరూపకమ్ ॥ ని ॥ వంశో వేణౌ కులేపి చేత్యమరః . తస్య విశిఖః - తోమరనామాఽఽయుధవిశేషః, వంశోచ్ఛేదక ఇత్యర్థః ॥ ని ॥ విశిఖస్తోమరే శరే ఇతి మేదినీ. యద్వా, విశేషేణ శిఖా జ్వాలా యస్య సః విశిఖః - అనలః, పౌలస్త్యవంశవనదావానల ఇత్యర్థః . మనుజాకృతిః - మనుష్యరూపః, లక్ష్మణరూప ఇతి భావః . విధిః - దైవమ్, కామమ్ - యథేచ్ఛమ్, నిహన్తు - హన్యాత్ , దైవగతేరలఙ్ఘ్యత్వాదితి భావః . కృతాన్తః - యమః, నేతుమ్ - ప్రాపయితుమ్ , త్వాం స్వపురీమితి చ శేషః . నయతేర్ద్వికర్మకత్వాత్ . దిక్పాలాః - ఇన్ద్రాదయో దిగధీశాః, త ఏవ కుఞ్జరాః - కరిణ ఇతి రూపకమ్, తేషాం హరేః - సింహస్య, నిఖిలదిక్పతివిదళనక్షమస్యేత్యర్థః . తవ అన్తికభువమ్ - సమీపప్రదేశమ్, కథం సధైర్యమభజత్ - ప్రాప్తవాన్, న జానే తదాగమనే భయాభావహేతుమిత్యర్థః. ॥ ౧౭౭ ॥

ఇతీతి ॥ ఇతి - ఏవమ్, ముక్తః కణ్ఠః యస్మిన్ కర్మణి తద్యథా తథా - ప్రకాశితకణ్ఠరవమిత్యర్థః, అత్ర కణ్ఠశబ్దేన కణ్ఠధ్వనిర్లక్ష్యతే. పరుదన్ - విలపన్, దశకణ్ఠః - రావణః, సుతశోకావేగేన - పుత్రశోకాతిశయేన, విలుప్తః - వినష్టః, వివేకః - కర్తవ్యాకర్తవ్యవిచారః, యస్య తాదృశః, కృత్యాకృత్యవిచారమూఢస్సన్నిత్యర్థః.

కోపాతిరేకాజ్జానకీం జిఘాంసురన్తికగతైర్నివార్యమాణో రణాయ స్వయమేవ జిగమిషురగ్రే ప్రాహిణోత్కిమపిబలమ్ ॥ ౧౭౮ ॥

॥ వ ॥ అనీనయదసఙ్ఖ్యాతం విఖ్యాతబలపౌరుషః । గాన్ధర్వాస్త్రేణ తత్సర్వం రామో నామావశేషతామ్ ॥ ౧౭౯ ॥ గ ॥ అథ హతపతిసుతానాథనాగరికవధూనికరనయనవారిపరీవాహపఙ్కిలనరపతి

---

కోపాతిరేకాత్ - రోషాతిశయాత్, జానకీం జిఘాంసుః - హన్తుమిచ్ఛన్సన్, ॥ సూ ॥ హన్తేస్సన్నన్తాదుప్రత్యయః. అన్తికగతైః - సమీపస్థితైః, రాక్షసీజనైః, నివార్యమాణః - స్త్రీవధో నకర్తవ్య ఇతి నిషిధ్యమానః, రణాయ స్వయమేవ జిగమిషుః - గన్తుమిచ్ఛుః, అగ్రే - పురతః, కిమపిబలమ్ - సైన్యమ్, మూలబలమిత్యర్థః. ప్రాహిణోత్ - ప్రేషితవాన్. ప్రపూర్వాత్ హిగతావితి సౌవాదికధాతోర్లఙ్. హినుమీనా ఇతి ణత్వమ్ ॥ ౧౭౮ ॥

అనీనయదితి ॥ విఖ్యాతబలపౌరుషః - ప్రసిద్ధబలపరాక్రమః, రామః అసఙ్ఖ్యాతమ్ - అపరిమితమ్, సర్వం తద్బలమ్, గాన్ధర్వాస్త్రేణ - గన్ధర్వదేవతాకేన అస్త్రేణ, నామావశేషతామ్, అనీనయత్ - ప్రాపయామాస. తదఖిలమపిబలం సఞ్జహారేత్యర్థః. ణీఞ్ ప్రాపణే ఇతి ధాతోర్ణిజన్తాత్కర్తరిలుఙ్. ॥ ౧౭౯ ॥

అథ రావణస్య రణప్రయాణ సంరమ్భమాహ — అథేతి ॥ అథ - మూలబలవినాశానన్తరమ్, దశకన్ధరః - రావణః, హతపతిసుతానామ్ - మృతరమణతనుజానామ్, నగరే భవా నాగరికస్త్యః, అధ్యాత్మాదేరాకృతిగణత్వాట్ఠఞ్ ॥ సూ ॥ ఠస్యేక ఇతి ఇకాదేశః. తాసామ్ - వధూనామ్, నికరస్య - సమూహస్య, నయనవారిపరీవాహేణ - బాష్పోదకప్రవాహేణ, యః పఙ్కః - కర్దమః, సోఽస్యాస్తీతి పఙ్కిలః; పిచ్ఛాదిభ్య ఇలజితి మత్వర్థీయ ఇలచ్. అనేన పౌరవధూనాం శోకబాష్పబాహుళ్యం ప్రతీయతే; యః నరపతిపథః-

